Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 25 • 15-6-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# జగన్‌కు జాతీయస్థాయిలో పెరిగిన పలుకుబడి!

18 శాసనసభ, ఒక లోక్‌సభ స్థానం ఉప ఎన్నికలు వైఎస్.జగన్‌కు జాతీయ స్థాయి ప్రాధాన్యతను సంతరించి పెట్టాయి. లోక్‌సభ ఎన్నికలో ఆయన పార్టీ దాదాపు మూడు లక్షల ఓట్ల మెజార్టీతో ఘనవిజయం సాధించడం ఢిల్లీ నేతల దృష్టిని బాగా ఆకర్షించింది. ఇప్పటికిప్పుడు ఈ ఒక్క అదనపు ఎమ్పీతో జగన్ ఢిల్లీలో చేయగల్గింది ఏదీ లేదు. కానీ భవిష్యత్తు ఎన్నికల దృష్ట్యా చూస్తే జగన్ ఎంత కీలకంగా మారుతాడో ఢిల్లీ పెద్దలకు బాగా తెలుసు. 42 స్థానాలున్న అంధ్రప్రదేశ్ నుంచి పెద్ద సంఖ్యలో ఎమ్పీలను ఢిల్లీకి తీసుక వెళ్లగలిగితే సంకీర్ణ రాజకీయాలను శాసించే అవకాశం లభిస్తుంది. అందువల్లనే నెల్లూరు లోక్‌సభ ఎన్నికల ఫలితం వెలువడగానే బిజెపికి చెందిన జై నారాయణ ప్రసాద్ అనే పార్లమెంట్ సభ్యుడు చర్లపల్లి జైలుకు వెళ్లి జగన్‌కు అభినందనలు తెలిపి వెళ్లాడు. మమతా బెనర్జీ పార్టీకి చెందిన మరొక లోక్‌సభ సభ్యుడు విజయమ్మకు ఫోన్ చేసి శుభాకాంక్షలు తెలియజేశాడు. ఉత్తర ప్రదేశ్ ముఖ్యమంత్రి అఖిలేష్ యాదవ్ శుభ సందేశం పంపాడు. ఎందుకైనా మంచిదని నమస్కార బాణం వేస్తున్నారన్న మాట.

ఢిల్లీలో రాజకీయాలు సంక్షుభితంగా వున్నాయి. రాష్ట్రపతి ఎన్నిక విషయంలో మమతా బెనర్జీ పేచీకి దిగుతున్నది. ములాయం సింగ్ ఆమెకు మద్దతిస్తున్నాడు. వీరిద్దరూ యుపిఎలో భాగస్తులు. వీరు పక్కకు తప్పుకొంటే మన్మోహన్‌సింగ్ సర్కారు నిలవదు. ఇప్పటికిప్పుడు పరిస్థితి అంత దూరం రాకపోయినా రేపేమౌతుందో చెప్పలేని ప్రమాదం పొంచి వున్న మాట నిజం. ఏ కారణం వల్లనైనా మధ్యంతర ఎన్నికలు వస్తే జాతీయ రాజకీయాలలో కీలక పాత్ర పోషించగల స్థాయికి చేరుకొంటాడు జగన్.

అయితే ఆయన జైలు నుంచి ఎప్పుడు బయటకు వస్తాడన్నది పెద్ద సమస్య. సిబిఐ కేసుల చీకాకు చాలక, ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ కూడా రంగంలోకి దిగుతున్నది. వారి దగ్గర మనీ ల్యాండరింగ్ చట్ట ఉల్లంఘన ఆధారాలు వుంటే మాత్రం జగన్ ఇప్పట్లో బయటకు రాలేడు. 2014 ఎన్నిక లకూ అనుమానమే. అంతకాలం జైలులో వుండి పార్టీని నడిపించడం, నిలబెట్టుకోవడం అంత సులభమైన పని కాదు. ఉపఎన్నికల వరకు వైఎస్.విజయమ్మ, షర్మిళ కష్టపడి తిరిగి, కడవలతో కన్నీళ్లు కార్చి, ప్రజల సానుభూతి పవనాలు సృష్టించిన మాట నిజం. అయితే వచ్చే ఎన్నికలకు కూడా ఇదే సానుభూతి పని చేస్తుందనుకోవడం పొరపాటు. ప్రజలకు మతి మరపు జాస్తి.

ఈ ఉపఎన్నికలలో 15 స్థానాలు గెలుచుకోగల్గినప్పటికీ, 2014 సాధారణ ఎన్నికలలో ప్రభుత్వాన్ని ఏర్పరిచే స్థాయిలో విజయం సాధిస్తాడన్న నమ్మకాన్ని కల్గించలేక పోతున్నాయి. రాయలసీమలో తప్ప తతిమా చోట్ల ఆయన అభ్యర్థులకు వచ్చిన మెజార్టీలు చెప్పుకోదగినవి కావు. ఆంధ్ర ప్రాంతం రాజకీయాలకు గుండెకాయ వంటి గోదావరి జిల్లాలలో రెండు స్థానాలలో ఓటమి ఎదురైంది. 34 శాసనసభ స్థానాలున్న జిల్లాలవి. తెలంగాణలో టిఆర్ఎస్ ప్రభ ఏమంత తగ్గలేదని పరకాల ఎన్నిక రుజువు చేసింది. అక్కడ కొండా సురేఖ గెలుపుకు దగ్గరగా వచ్చినప్పటికీ తెలంగాణలోని అన్ని జిల్లాలలో కూడా సురేఖ వంటి వీర నారీమణులు లేరు. పరకాలలో ఆమె కుటుంబానికి స్వంత సైన్యం వుంది. వైఎస్.రాజశేఖర్‌రెడ్డితో ఆమె అనుబంధం అందరికీ తెలుసు. అయినా తెలంగాణ ప్రజలు ఆంధ్రలో వలె ఆమెను ఆదరించలేదు. తన పలుకుబడితో కెసిఆర్‌కు చుక్కలు చూపించడం ఒక్కటే కొండా సురేఖకు మిగిలిన సంతృప్తి.

ఈ ఎన్నికను కెసిఆర్ చాలా తేలికగా తీసుకొన్నాడు. ఒకే ఒక్క రోజు ఒకే ఒక్క సభలో మాట్లాడడం తప్ప ఆయన చేసిన ప్రచారం శూన్యం. మరొక ప్రక్క ఇక్కడ టిఆర్ఎస్ అభ్యర్థి భిక్షపతి వూరు పేరు లేని అనామకుడు. చేతిలో చిల్లి గవ్వలేని పేదవాడు. అయినా తెలంగాణవాదానికున్న బలం ఆయన్ను

కొరవ 14వ పేజీలో

# ఈ ఆటలాపండి!

18 అసెంబ్లీ, ఒక పార్లమెంట్ స్థానం ఉప ఎన్నికలు ముగిసాయి. పేరుకు ఉప ఎన్నికలైనా సాధారణ ఎన్నికలంత ఆగం నడిచింది ఈ రెండు నెలల కాలం. అన్ని రాజకీయ పార్టీలు తమ శక్తియుక్తులన్నిటినీ వీటిపైనే కేంద్రీకరించాయి. వేరొకపని లేకుండా కాలం గడిపాయి. ప్రభుత్వం సంగతి చెప్పనే అవసరం లేదు. ముఖ్యమంత్రి, మంత్రులు పూర్తిగా ఎన్నికలపైనే దృష్టి పెట్టారు. అధికారులు ఫైళ్లను పక్కన పారేశారు. ఎన్నికల నియమావళి పేరుతో జిల్లాలలో కూడా ప్రజా విజ్ఞప్తులన్నిటినీ పాతర వేశారు. సాధారణ అభివృద్ధి కార్యక్రమాలు కూడా స్తంభించిపోయాయి. ఏ ఆఫీసుకు ఎంత అత్యవసర పని మీద వెళ్లినా ఎన్నికల తర్వాత కన పడండని వెనక్కు పంపేశారు అధికారులు.

2009 తర్వాత ఇటువంటి పరిస్థితి ఏర్పడడం ఎన్నో సారో లెక్కలేదు. తెలంగాణ ఉద్యమం, జగన్ రాజకీయాల పేరుతో ఇప్పటికి 65 మంది శాసనసభ్యులు తమ పదవులకు రాజీనామాలు చేశారు. వాటన్నిటికీ ఉపఎన్నికలు జరపక తప్ప లేదు. మూడు నెలలకొకసారి ఈ చీకాకు ప్రజలను ఇబ్బంది పెట్టింది. ఇప్పుడు కూడా మరొక ఇద్దరు ఎమ్మెల్యేలు రాజీనా మాలు చేసి వున్నారు. నాలుగైదు నెలల వ్యవధిలో వాటికి కూడా ఎన్నికలు జరపక తప్పదు. రాజకీయ పార్టీలు పదే పదే తమ ఉనికిని నిరూపించుకోవల్సిన అగత్యం ఏర్పడడం చాలా దురదృష్టకరం. ప్రజాస్వామ్యానికి ఎన్నికలనేవి హృదయ చలనం వంటివి. మనిషి గుండె ఎక్కువసార్లు కొట్టుకొన్నా, తక్కువసార్లు కొట్టుకొన్నా ప్రాణం పోయినట్లే, చీటికి మాటికి ఎన్నికలు జరిగినా, అసలే జరగకపోయినా ప్రజాస్వామ్యం బలహీన పడిపోతుంది. ఎమ్మెల్యేలు విధానపరమైన విభేదాల తోనో, సిద్ధాంతపరమైన విరోధంతోనో, ప్రజా సమస్యల కోసమో రాజీనామా అస్త్రాన్ని ప్రయోగిస్తే కొంతవరకు అర్థం చేసుకోవచ్చు. తెలంగాణవాదులది ఆ కోవకు చెందిన ప్రక్రియ. తరచు ఎన్నికలు తెచ్చి, ప్రభుత్వంపై ఒత్తిడి పెంచి, తమ ఉద్యమ లక్ష్యాన్ని సాధించుకోవడానికి వారు రాజీనా మాలకు పూనుకొంటున్నారు. కానీ జగన్ ఎమ్మెల్యేలది పూర్తిగా స్వార్థపరమైన రాజకీయం. ఏదో ఒక రకంగా ప్రభుత్వాన్ని పడగొట్టి, అర్జంట్‌గా జగన్‌ను ముఖ్యమంత్రి పీఠం ఎక్కించ డానికి రాజీనామా కుట్రలకు పాల్పడుతున్నారు వారు. ఒక వ్యక్తి స్వార్థం కోసం మొత్తం ప్రజాస్వామ్య వ్యవస్థనే సంక్షు భితం చేస్తున్నారు. గర్హనీయమైన విషయం ఇది.

పార్టీ ఫిరాయింపు చట్టం చేసే సమయంలో ఇటు వంటి సమస్యను వూహించలేక పోయాడు రాజీవ్‌గాంధీ. కనీసం ఇప్పుడైనా కేంద్ర ప్రభుత్వం, జాతీయ పార్టీలు దీనిపై శ్రద్ధ పెట్టడం అవసరం. ఎన్నికైన శాసనసభ్యులు కానీ, లోక్ సభ సభ్యులు కానీ మధ్యలో రాజీనామా చేస్తే, ఆ సభల కాల పరిమితి ముగిసే వరకు ఆయా సభ్యులు తిరిగి ఎన్నిక లలో పోటీ చేయకుండా అనర్హత విధిస్తే తప్ప ఈ రాజీ నామా ఆటలు ఆగవు. అదే సమయంలో ఫిరాయింపుకు పాల్పడిన వారిని కనీసం ఆరేళ్లపాటు ఏ ఎన్నికలోనూ పోటీ చేయకుండా నిరోధించాలి.

మధ్య మధ్యలో ఎన్నికలు ఎదుర్కోవలసి రావడంతో, రాజకీయ పార్టీలకు అగ్ని పరీక్ష చందంగా వుంటున్నది. దానితో ఎట్లయినా గెలవాలనే తపనతో డబ్బు క్రుమ్మరిస్తు న్నారు. ఇప్పుడు జరిగిన ఉపఎన్నికలలో మొత్తం రాజకీయ పార్టీల ఖర్చు 500 కోట్ల వరకు వుంటుందని అంచనా. తిరు పతి, ఉదయగిరి, నరసాపురం, పత్తిపాడు వంటి చోట్ల ఒక్కొక్క అభ్యర్థి 20 కోట్లు కూడా వెచ్చించా డని వార్తలొస్తున్నాయి. ఓటుకు 200 రూపాయల నుంచి 2వేల రూపాయల వరకు ధర పలుకుతున్నది. అయితే గతంలో కానీ, ఇప్పుడు కానీ ఓటర్లు డబ్బు తీసుకొంటున్నారే తప్ప, ఆ కృతజ్ఞతతో ఓటు చేసిన దాఖలా కన్పించడం లేదు. రాజకీయ పార్టీలు, అభ్యర్థులు ప్రజలను ఇతరత్రా ఆకర్షించలేక, మెప్పించలేక డబ్బునే అస్త్రాన్ని విచ్చలవిడిగా ప్రయోగిస్తున్నారు. సాధారణ ఎన్నికలలో ఇంత ధన ప్రవాహం జరగని పని. ఉప ఎన్ని కలు కావడంతో, తమకున్న వనరులన్నిటినీ ఒకే చోట కేంద్రీకరిస్తున్నారు. తమ ఉనికిని చాటుకోవడానికి అడ్డమైన దారులన్నీ తొక్కుతున్నారు. సాధారణ ఎన్నికలలో ఎన్నికల మ్యానిఫెస్టో ప్రకటిస్తారు. ప్రజలకు తామేమి చేయబోతున్నదీ చెప్తారు. కాని ఉపఎన్నికలలో ఆ అవకాశం లేదు. తిట్లు, శాపనార్థాలు మాత్రమే ప్రచార అస్త్రాలు. దానితో ఎన్నికల వాతావరణం కలుషితమై పోతున్నది. ప్రజాస్వామ్యానికి పీడగా పరిణమిస్తున్న ఈ ఉపఎన్నికల ఆటను ఎంత త్వరగా ఆప గలిగితే, దేశానికి అంత మేలు.

జమీన్‌రైతు

## జనవాణి

### మద్యాన్ని నియంత్రించండి!

త్రాగడానికి సురక్షిత మంచి నీరు దొరకని మారుమూల పల్లెల్లో సైతం మద్యం ఏరులై పారుతుంది. పేదవారు నాటుసారాను ఆశ్రయించడం వలన పల్లెల్లో నాటుసారా విక్రయాలు జోరుగా సాగుతున్నాయి. కల్తీసారా త్రాగి ఎంతో మంది ఆరోగ్యాలను నాశనం చేసుకుంటున్నారు. వారి కుటుంబాలు పోషించే దిక్కులేక రోడ్డున పడుతున్నాయి. పేదల బ్రతుకులు కాలిపోతున్నా ఎక్సైజ్ అధికారులు అవినీతికి అలవాటుపడి ఉదాసీనంగా వ్యవహరిస్తున్నారు. మద్యం మత్తులో కొట్లాటలు జరగడం వల్ల పల్లెల్లో శాంతిభద్రతలు ఒక ప్రధాన సమ స్యగా మారాయి. ప్రభుత్వం తక్షణం స్పందించి దిద్దుబాటు చర్యలు చేపట్టకపోతే పచ్చదనం, ప్రశాంతతకు నిలయాలైన గ్రామాల్లో అశాంతి పెచ్చుపెరుగుతుంది.

పి.సత్యబాల — కావలి

### ధాన్యం నిల్వలతో ఇబ్బందులు!

పెరిగిపోతున్న ఆహార ధాన్యాల నిల్వలు కొన్ని సమస్యలను సృష్టిస్తు న్నాయి. జూన్ 2012 నాటికి ఆ ధాన్యాల నిల్వలు 7.5 కోట్ల టన్నులకు చేరుకో వచ్చని అంచనా. అయితే ఐదుకోట్ల టన్నులకే పూర్తి రక్షణ కల్పించే సౌకర్యం వుంది. షుమారు 2.5కోట్ల టన్నుల ధాన్యానికి సరైన రక్షణలేక పాడయ్యే ప్రమా దం వుంది. పరిస్థితిని చక్కదిద్దడంలో ప్రభుత్వం శ్రద్ధ తీసుకోవాలి.

పి.రమణయ్య — తోటపల్లి గూడూరు

### బలవంతం వద్దు!

చదువు, వివాహం విషయంలో పిల్లలను బలవంతం చేస్తున్నారు ఈనాటి తల్లిదండ్రులు. డబ్బు కోసం, హోదా కోసం ఇష్టం లేని పెళ్ళిళ్ళు చేసేసి పిల్లల జీవితాలను నరకం చేస్తున్నారు. దాని ఫలితం, అక్రమ సంబంధాలు, విడాకులు, ఇంటి నుంచి పారిపోవడం. కొందరు పైకి మాత్రం భార్యాభర్తల్లా నాటకం ఆడుతుంటారు. ఇక చదువు విషయంలోనూ అంతే. ప్రక్కవాడు ఇంజనీరో, డాక్టరో అయ్యాడని, అమెరికా వెళ్లి కోట్లు సంపాదిస్తున్నాడంటూ పిల్లలు ఇష్టం లేని, చదవలేని కోర్సులు బలవంతంగా వారిపై రుద్దుతున్నారు. ఫలితం ఆత్మ హత్యలు, హాస్టల్ నుంచి పారిపోవడం. తల్లిదండ్రుల్లో మార్పు అవసరం.

పి.అరుణకుమారి — నెల్లూరు

### వీళ్లు చేసేదేమిటి?

ప్రభుత్వం స్పెషల్ కోటా క్రింద రాజ్యసభకు ఎన్నుకొంటున్న ఎమ్పీల వల్ల ప్రయోజనం కనపడడం లేదు. నటి రేఖను గౌరవ ఎమ్పీగా నామినేట్ చేశారు. ఈ విధంగా నామినేట్ చేయబడుతున్న సినీతారలు, బడా పారిశ్రామికవేత్తల ఇళ్లకు వెళ్లి సామాన్య జనం సమస్యలు విన్నవించుకొనే అవకాశం వుండదు. రేఖ ఎమ్పీగా ప్రమాణ స్వీకారం చేసి అరగంట కూడ సభలో కూర్చోలేకపోయారట.

జి.గోపాల్‌రెడ్డి — నెల్లూరు

## 70 ఏళ్ల క్రితం ఈవారం

19-6-1942
పేజీలు : 8 వెల: అణా

### పల్లెలు
### లేబూరు ప్రతిభ

నాలుగు వేల జనాభా చేతను, పాడుబడిన ఎత్తైన మేడల చేతను, ఊరు చుట్టూ ఆవరింపబడిన మురికి గుంటల చేతను, ఆస్తుండియు దేబిరిస్తున్న దేవాలయాల చేతను, బోర్డుండియు పాడుబడిన బావుల చేతను, కోర్టుండియు విచారించ తరగని కేసుల చేతను, పాత లెక్కలు తేల్చకనే కొత్త నాటకాలు వేయించు నూత్న సమాజాల చేతను, నైరుతి మూల ముండమోసిన చెరువు చేతను, ఉత్తరాన పాడుబడ్డ దొరువు చేతను, రమణమామ అచ్చుగుద్దించినట్లు మామిడి, జామ, టెంకాయ, కిచ్చిడి, గజనిమ్మ ఆకుతోటల చేతను, నూటికి 90 మంది నిరక్షరకుక్షుల చేతను, సంవత్సరానికొక తరగతి వంతున ఎత్తివేసే బోర్డు పాఠశాల శోభచేతను, కాంగ్రెసు మెంబరు కలికానికి గూడాలేని రాజభక్తి చేతను, మోపూరుకు ఏమాత్రం తీసిపోని దాబుసరి చేతను, కొమరికను తలదన్నే అంతః పార్టీల చేతను, నిరర్థక కార్యాలలో తీసిపోని చందాల పట్టీల చేతను, అధికార వ్యామోహంతో పోటీబడ్డ యుద్ధ ఫండు చేతను, కుంకాళమ్మ పేరుతో ఐదు వేలు, శివుడి పేరుతో వెయ్యి, రామమందిరం పేరుతో రెండు వందలు, గ్రామం పేరుతో మూడు వందలు కైంకర్యము లెక్కలు చెప్పని పెద్దల చేతను, ఊరు – పేరులేని మేనేజింగ్ కమిటీల చేతను,

ఎంతో శృంగారమై యున్నది
లేబూరు పుర
ఎంతో వైభోగమై యున్నది"
ఇలా వున్నవండీ పల్లెటూళ్లు.

–దంబాచారి

## 50 ఏళ్ల క్రితం ఈవారం

16-6-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### భూమి తనఖా బ్యాంకు

నెల్లూరు భూమి తనఖా బ్యాంకును 17-4-1962 తేది ఆక్రమించుకొన్న నల్లపరెడ్డి సుబ్బరామిరెడ్డి వర్గాన్ని వైదొలగించి, బ్యాంకును స్వాధీనం జేసుకొని, ఎన్నికలు జరుపవలసిందిగా రిజిస్ట్రారును కోరుతూ ప్రభు త్వం ఉత్తర్వు జేసింది. సహకార శాఖామంత్రి ఈ ఉత్తర్వు చేయడం, నీటిపారుదలమంత్రి ఈ ఫైలును తెప్పించు కోవడం, చివరకు ముఖ్యమంత్రి ఉత్తర్వును ధృవపరచడం జరిగిందట. ప్రభుత్వం అనేది ఒకటున్నదని రుజువు జేసినందుకు నీలం సంజీవరెడ్డి గారిని అభినందిస్తున్నాము. ఈ విషయంలో ముఖ్యమంత్రి ఇరు వర్గాల మధ్య రాజీకి ప్రయత్నించ వచ్చుంటున్నారు. అది జరగడం అభిలషణీయంగా, ప్రశంసనీయంగా ఉంటుంది.

### ఎలక్షన్ ట్రిబ్యునల్

సర్వేపల్లిలో వేమారెడ్డి వెంకురెడ్డి ఎన్నిక చెల్లనేరదని వంగల్లు కోదండరామిరెడ్డి గారు దాఖలు జేసిన ఎలక్షన్ పిటిషన్ విచారణకు ట్రిబ్యునల్‌గా నెల్లూరు జిల్లా జడ్జి సమియుద్దీన్ అహ్మద్ నియమింపబడినాడు. ప్రతివాది వేమారెడ్డి వెంకురెడ్డి గారికి నోటీసు నిమిత్తం ఈ దావా 21వ తేదికి వాయిదా వేయబడి ఉన్నది.

ఏ.సి సుబ్బారెడ్డి గారిపై వేసిన దావా ఇంకా గెజిట్‌లో ప్రకటింపబడలేదు.

### మరో మోటారు కార్మిక సంఘం

కమ్యూనిస్టుల ఆధ్వర్యాన ఉన్న నెల్లూరు మోటారు లేబర్ యూనియన్‌కు లోగడ రాజీనామా యిచ్చిన వారు గాక; వైస్ ప్రెసిడెంటు ఆర్.దేవదానంతో సహా మరో 11 మంది అందునుండి వైదొలగారు. 12వ తేదీ షుమారు 70 మంది మోటారు కార్మికులు సమావేశమై జిల్లా మోటారు కార్మిక సంఘాన్ని ఏర్పరచుటకు, మహాసభ జరుపుటకు నిర్ణయిస్తూ ఏ.వి.రత్నం కన్వీనర్‌గా కమిటీని ఏర్పరచారు.

# నెల్లూరు ముచ్చట్లు

## ఉదయగిరిలో అత్యధికంగా పోలింగ్!

నెల్లూరు పార్లమెంటు స్థానం పరిధిలోని ఏడు నియోజకవర్గాల్లో అత్యధికంగా ఉదయగిరి నియోజకవర్గంలో 81.66 శాతం పోలింగ్ నమోదయ్యింది. కందుకూరులో 78.3, ఆత్మకూరులో 79.24, కోవూరులో 76.85, నెల్లూరు రూరల్‌లో 61.29, కావలిలో 73.37, నెల్లూరు సిటీలో 54.5 శాతం పోలింగ్ జరిగింది. మొత్తంమీద అన్ని అసెంబ్లీ నియోజకవర్గాలతో కలిపితే పార్లమెంటు స్థానంలో 71.39 శాతం పోలింగ్ నమోదయ్యింది.

## పనిచేయని ఈవిఎంలు!

జిల్లాలో ఉప ఎన్నికలకు గాను 1420 ఇవిఎంలు వాడగా ఎన్నికల రోజు యల్లాయపాళెం, బోయినచిరువెళ్ల, పొనుగోడు, కావలి యదవల్లి గ్రామాలలో ఇవి మొరాయించడంతో కొత్త వాటితో పోలింగ్ మళ్లీ మొదలెట్టాల్సి వచ్చింది. పాత వాటిలో వేసిన ఓట్లు కూడా లెక్కింపులోకి వస్తాయంటున్నారు. డిఆర్వో రామిరెడ్డి గారు!

## ఫలితానికి ముందే హుషారు!

గెలుపు మనిషిలో ఎక్కడలేని ఉత్సాహం తెచ్చి పెడుతుంది. 12వ తేది జరిగిన నెల్లూరు పార్లమెంటు ఉపఎన్నిక పోలింగ్ సరళి పరిశీలించాక 'ఫ్యాను' గాలి బాగా వీచిందన్న విషయం అందరికీ తెలిసింది. పోలింగ్ సరళిని పరిశీలిస్తున్న వైకాపా అభ్యర్థి మేకపాటి రాజమోహన్ రెడ్డికి నెల్లూరు రామలింగాపురంలోని పిడబ్ల్యుడి ఆఫీసు వద్ద మీడియా ఎదురు పడగా ఆయన ఫలితంపై ప్రశ్నించారు. విలేకరులు ఆయనకు అడ్వాన్స్ శుభాకాంక్షలు తెలుపగా ఆయన కూడా కరెంట్ లేకుండానే మహోధృతంగా ఫ్యాన్ గాలి వీచిందన్నారు. ప్రజల్లో వైఎస్ కుటుంబంపై పెల్లుబుకిన అభిమానం దీనికి కారణమని నిర్వచించారు. ఈ పోలింగ్ కేంద్రం వద్ద రాజమోహన్‌రెడ్డి విరివిగా ఓటర్లకు షేక్‌హ్యాండ్ ఇచ్చి ఎగిరి కారెక్కడం చూసిన వారు గెలుపు 'జోష్' అటువంటిదని వ్యాఖ్యానించారు.

## తొలి ఓటు వేసిన కలెక్టర్

జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి ఓటు వేయను చాలా ఆసక్తి చూపారు. నెల్లూరు పొదలకూరురోడ్డులోని సెయింట్ జోసఫ్ ఇంగ్లీషు మీడియం స్కూల్‌లోని 103 నెంబర్ పోలింగ్ కేంద్రానికి ఉదయం ఎనిమిది గంటలకు సతీసమేతంగా విచ్చేసి ఓటు వేశారు. ఓటు వేశాక పెట్టే ఇంక్ మార్క్‌ను గోరు తోపాటు చర్మం పైకి వచ్చేలా పెట్టమని పోలింగ్ సిబ్బందికి సూచించారు.

## మీడియాకు సలహా ఇచ్చిన యువతి!

పోలింగ్ సరళిని పరిశీలించేందుకు నెల్లూరు నుంచి వెళ్లిన పాత్రికేయ బృందం కోవూరులో ఏవిధంగా ఓట్లు పడుతున్నాయనే విషయమై వాకబు చేయను కొందరు ఓటర్లతో మాటా మంతీ కలిపారు. ఈ సమయంలో ఒక యువతి తాను ఫ్యాను గుర్తుకు ఓటేశానని గట్టిగా చెప్పడంతోపాటు మీడియా కూడా జగన్మోహన్‌రెడ్డికి మద్దతు ఇవ్వాలని ఉచిత సలహా యిచ్చి వెళ్లడంతో పాత్రికేయులు ఖంగుతిన్నారు.

## టెంకాయ కొట్టి తకరారు తెచ్చాడు!

ఉదయగిరి నియోజకవర్గ పరిధిలోని వరికుంటపాడు మండలం జి.కొండారెడ్డిపల్లి గ్రామంలోని కాంగ్రెస్ పార్టీ అభిమాని ఒకరు ఓటింగ్‌కు వచ్చి ఇవిఎం దగ్గర టెంకాయ కొట్టాడు. ఈ వ్యవహారం చిలికి చిలికి గాలివానగా మారి కాంగ్రెస్, వైకాపా కార్యకర్తలు కొట్టుకోవడంతో ఏడు మందికి గాయాలయ్యాయి.

## ఓటేయని గ్రామాలు

నెల్లూరు పార్లమెంటు స్థానానికి 12వ తేది జరిగిన ఉప ఎన్నికల్లో కొడవలూరు మండలం రాచర్లపాడు గ్రామస్తులు ఓటెయ్యలేదు. గ్రామస్తుల భూములను ఎన్నో ఆశలు చూపి స్వాధీనం చేసుకొన్న 'ఇఫ్కో' అధికారులు ఫ్యాక్టరీ కట్టక పోవడంతో బతుకుతెరువు లేక అల్లాడి పోతున్నామన్నారు. ఈ విషయం రాష్ట్ర వ్యాపితంగా తెలియనే ఓట్లు వేయడం లేదన్నారు.

కావలి రూరల్ మండలం చౌదరిపాళెం గ్రామస్తులు గ్రామంలోని నీటి సమస్య, రహదారుల సమస్యను ఇప్పటి వరకు ఎవరూ పరిష్కరించనందున ఓట్లు వేయకూడదని తీర్మానించుకొన్నారు. అయితే ప్రభుత్వ అధికారుల ప్రోద్భలంతో నెల్లూరు పార్లమెంటు స్థానానికి పోటీచేసిన ఈ గ్రామస్థుడైన ఇండిపెండెంట్ అభ్యర్థి ఓటు వేయడం విశేషం. కావలి రూరల్ మండలంలోని చిన్న పవని, పెద్దపవని గ్రామస్తులు రాజకీయ పార్టీల నేతలు తిరునాళ్ల చేసుకోను డబ్బులివ్వలేదని మొదట ఓటింగ్‌కు రాకపోయినా ఆ తర్వాత ఏమి జరిగిందో ఏమో వచ్చి ఓటు వేశారు. రాచర్లపాడులో 527, చౌదరిపాళెంలో 550 ఓట్లు ఉండినాయి.



## ఓటులేని టిఎస్ఆర్!

నెల్లూరు పార్లమెంటు స్థానం నుంచి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసిన తిక్కవరపు సుబ్బరామిరెడ్డికి నెల్లూరులో ఓటు లేకపోవడంతో ఆయన ఓటు హక్కు వినియోగించుకోలేక పోయారు. కానీ వైకాపా అభ్యర్థి మేకపాటి రాజమోహన్ రెడ్డి తన స్వగ్రామం బ్రాహ్మణపల్లెలో, తెలుగుదేశం అభ్యర్థి వంటేరు వేణుగోపాల్‌రెడ్డి స్వగ్రామం బ్రాహ్మణకాకలో, సిపిఎం అభ్యర్థి చంద్ర రాజగోపాల్ నెల్లూరు బాలాజీనగర్‌లో ఓటు హక్కు వినియోగించుకొన్నారు.

## పారామిలటరీ దళాలదే ఘనత!

నెల్లూరు పార్లమెంటు, ఉదయగిరి అసెంబ్లీ స్థానం ఉప ఎన్నికలు ప్రశాంతంగా జరగడంలో పారామిలటరీ దళాల ఘనత ఎంతో ఉందని చెప్పొచ్చు. గుజరాత్, ఉత్తరప్రదేశ్‌ల నుంచి వచ్చిన 37 కంపెనీల పారామిలటరీ దళాలు ఎంతో చక్కగా విధి నిర్వహణ చేశాయి. ఓటరు స్లిప్పు చూసి మరీ ఓటర్లను పోలింగ్ కేంద్రంలోకి పంపడంతో గొడవలకు ఆస్కారం లేకుండా పోయింది. వీరివల్ల మన పోలీసులకు పనిలేకుండా పోయింది.

## ఓటు వేయను వెళ్లి అనంతలోకాలకు...

మర్రిపాడు మండలం పొంగూరు కండ్రిగకు చెందిన శేషమ్మ(60) ఓటు వేయను పోలింగ్ కేంద్రానికి వెళ్లి గుండెపోటు రావడంతో అక్కడికక్కడే మరణించింది. ఆమె కడు పేదరాలు. ఆమె కుటుంబాన్ని ప్రభుత్వం ఆదుకోవాల్సి ఉంది.

## వెబ్ క్యాస్టింగ్ చూస్తూ సలహాలు!

కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి కలెక్టరేట్‌లో ఏర్పాటుచేసిన వెబ్ క్యాస్టింగ్ కెమెరాల ద్వారా పోలింగ్ సరళిని పరిశీలించారు. ఉదయగిరి నియోజకవర్గంలోని ఓ పోలింగ్ కేంద్రం లోపల ఓటర్లకు నమస్కారం పెడుతుండిన మేకపాటి రాజమోహన్‌రెడ్డికి కలెక్టర్ స్వయంగా ఫోను చేసి అలా చేయకూడదని సలహా ఇవ్వడంతో తాను అలవాటులో పొరపాటుగా చేశానని ఆయన ఒప్పుకొని బయటకు వచ్చారు.

## పెరిగిన కోత

కోత విధించే గంటలను పెంచారు విద్యుత్ శాఖ అధికారులు. ప్రస్తుతం విధిస్తున్న కరెంటు కోతలను మరో రెండు గంటలపాటు పొడిగించారు. నగరంలో ప్రస్తుతం 9 నుంచి 10 గంటల వరకు ఉన్న కోతను 11 గంటల వరకు, సాయంత్రం 4 నుంచి 5 వరకు ఉన్న విద్యుత్ కోతను 6 గంటల వరకు పెంచారు. మునిసిపాలిటీల్లోనూ, మండలాల్లోనూ ఇలాగే విద్యుత్ కోత సమయాన్ని పెంచారు. రుతు పవనాలు రాక, ఎండలు తగ్గని ఈ పరిస్థితుల్లో విద్యుత్ కోతల సమయాన్ని పెంచడంతో ప్రజలు నరకయాతన అనుభవిస్తున్నారు.

## కస్తూరిదేవి స్కూల్‌లో మంచి ఫలితాలు!

పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో నెల్లూరు కస్తూరిదేవి బాలికోన్నత పాఠశాల విద్యార్థినిలు ఉత్తమ ఫలితాలు సాధించారు. షేక్.నస్రీన్, జి.భవాని, కె.కోమలులు 9 గ్రేడ్ పాయింట్లతో పాఠశాల ప్రథములుగా నిలిచారు. వీరిలో నస్రీన్ బేల్దారు కూలీ కుమార్తె. వీరేగాక 9 మంది విద్యార్థులు ఎ2 గ్రేడు సాధించారు. పరీక్షలకు హాజరైన 75 మంది విద్యార్థినులలో 42 మంది ఉత్తమ గ్రేడులలో ఉత్తీర్ణత సాధించారు.

## జైనుల ఉత్సవాలు

మండపాలవీధిలోగల జైన్ మందిరంలో తీర్థంకర్ సుమతినాథ్ నూతన విగ్రహ ప్రతిష్టాపనా మహోత్సవాలు వేడుకగా జరుగుతున్నాయి. జూన్ 14వ తేది నుంచి ప్రారంభమైన ఈ వేడుకలను 22వ తేది వరకు నిర్వహించేందుకు నగరానికి చెందిన జైన్ శ్వేతాంబర్ మూర్తి పూజక్ సంఘ్ విస్తృత ఏర్పాట్లు చేసింది. అందుకుగాను పాత అమెరికన్ హాస్పిటల్ ప్రాంతంలో భారీ సెట్టింగ్ వేసి వేలాది మంది ఈ కార్యక్రమంలో పాలుపంచు కొనేలా అన్ని వసతులు కల్పించారు. నూతన విగ్రహ ప్రాణ ప్రతిష్ట కోసం జైన్ మతాచార్యులు శ్రీ విజయ రాజయష్ సుదేశ్వర్‌జీ, శ్రీ విజయ రవీంద్ర సుదేశ్వర్‌జీలు నగరానికి విచ్చేసి భక్తులకు ఆధ్యాత్మిక బోధనలు చేశారు. ఈ కార్యక్రమానికి దేశవ్యాప్తంగా వివిధ ప్రాంతాల నుంచి జైన్ మతస్తులు హాజరవుతున్నట్లు సంఘ్ నిర్వాహకులు శాంతిలాల్ జైన్, రాజేంద్ర కుమార్ జైన్ తెలిపారు.

కొరవ 14వ పేజీలో

● వైఎస్ఆర్ కాంగ్రెస్‌కు

# తురుపుముక్క షర్మిళ!



వైఎస్ రాజశేఖర్‌రెడ్డిలా చేతిని ఊపుతున్న షర్మిళ.

భవిష్యత్తులోనూ వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ప్రచారానికి జగన్మోహన్‌రెడ్డి సోదరి షర్మిళ తురుపు ముక్కగా రూపొందిందని చెప్పవచ్చు. ఉప ఎన్నికల ప్రచారంలో భాగంగా 9వ తేది కావలి, నెల్లూరు రోడ్‌షోలలో విజయమ్మ కన్నా షర్మిళ ప్రసంగాలే జనాన్ని బాగా ఆకట్టుకొన్నాయి. దీని కారణంగా షర్మిళ సైతం స్వర్గీయ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి శైలిని అనుకరిస్తూ మాట విరుపుతో, ఎడమచేతిని ఎత్తి మాట్లాడడం, వైఎస్ ఊత పదం

## ఆకట్టుకొన్న ఉపన్యాసాలు!

'అట'ను పలుసార్లు ఒత్తిపలకడమనొచ్చు. దరిదాపులు షర్మిళ పాల్గొన్న ప్రతి సభలోనూ ఒకే అంశాలను ప్రస్తావించినా చెప్పదలచుకొన్న విషయాన్ని స్పష్టంగా చెప్పేయడం జనాన్ని బాగా ఆకర్షించింది. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి, పిసిసి అధ్యక్షుడు బొత్స సత్యనారాయణ, రాజ్యసభ సభ్యుడు మెగాస్టార్ చిరంజీవిని విమర్శించిన సరళికి జనం కేరింతలు కొడుతున్నారు. నెల్లూరు గాంధీబొమ్మ సెంటర్‌లో ఆనం సోదరులను ఉద్దేశించి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి వల్ల ఎన్నో మేళ్లు పొందిన ఆ సోదరులు ఆయన్ను నీచంగా మాట్లాడడం వింటుంటే మనసు బాధ పడుతుందనడం జనంలో బాగా పేలింది. సింహం బోనులో వున్నా, బయట వున్నా సింహమేనని జగన్ జైలు జీవితాన్ని షర్మిళ పోల్చడం కూడా జనానికి బాగా నచ్చింది. మైకుపట్టుకొన్న వెంటనే తనను తాను పరిచయం చేసుకొంటూ నేను వైఎస్ఆర్ కూతుర్ని... జగనన్న చెల్లెలిని... నా పేరు షర్మిళ అని చెప్పడం కూడా హృదయాలను తాకుతుంది. జగన్‌మోహన్‌రెడ్డి జైలులో వున్నా, జైలు బయటకు వచ్చినా భవిష్యత్తులో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ప్రచారానికి షర్మిళ తురుపుముక్కని రాజకీయ విశ్లేషకులు భావిస్తున్నారు. వైఎస్ జగన్ కన్నా సుత్తి లేకుండా సూటిగా మాట్లాడే నేతగా షర్మిల స్వల్పకాలంలోనే గుర్తింపు పొందారనడం నిజం.

# అఘాయిత్యానికి యత్నించిన డాక్టర్!

## ● వృత్తికే కళంకం

చికిత్స కోసం హాస్పిటల్‌కు వచ్చిన మహిళకు మత్తిచ్చి అఘాయిత్యానికి పాల్పడబోయిన వైద్యుడి నిర్వాకం బట్టబయలైంది. నగరంలోని సాయిబాబా మందిరానికి సమీపంలో ఒక మహిళా డాక్టర్ హాస్పిటల్‌ను నిర్వహిస్తోంది. సాధారణ కాన్పులు చేయడంలో ఆమె మంచి పేరు సంపాదించుకొంది. ఆమె భర్త కూడా మత్తు డాక్టర్. ఆపరేషన్లు నిర్వహించేటప్పుడు పేషంట్లకు మత్తివ్వడం చేస్తారు. డాక్టర్ అన్న సంగతి మరచిన ఈ ప్రబుద్ధుడు తన హాస్పిటల్‌కు వచ్చే పేషెంట్లతో అసభ్యకరంగా ప్రవర్తించడం గగ్గోలు రేపింది. ఇటీవల నగరానికి చెందిన ఒక మార్వాడి కుటుంబానికి చెందిన మహిళ ఇక్కడకు చికిత్స కోసం రాగా ఈ మత్తు వైద్యుడు ఆమెపై ఆఘాయిత్యానికి యత్నించాడట. దీనిని గమనించిన ఆ మహిళ అరచి కేకలు పెట్టడంతో గందరగోళం నెలకొనింది. విషయం తెలుసుకొన్న ఆమె బంధువులు హాస్పిటల్‌కు చేరుకోవడంతో ఆ డాక్టర్ పరారయ్యాడట. దీనిపై ఆ కుటుంబం కేసు పెట్టేందుకు సిద్ధంకాగా డాక్టర్లు కాళ్ల బేరానికి వచ్చి కొంత నగదు చెల్లించేలా రాజీ కుదుర్చుకొన్నారట. ఆనాటి నుంచి హాస్పిటల్ నిర్వాహకురాలైన మహిళా డాక్టర్ తాను నిర్వహించే శస్త్రచికిత్సలకు బయటి నుంచి మత్తు డాక్టర్‌ను పిలిపిస్తూ, భర్తను ప్రక్కన పెట్టిందట. ఈ మత్తు డాక్టర్ పైశాచిక ప్రవృత్తి వల్ల గతంలోనూ పలు ఘటనలు జరిగి వున్నాయట. ఆయనకు ఇక్కడ మందుల షాపు నిర్వహించే ఒక వ్యక్తి, కొందరు వైద్య సిబ్బంది సహకారం అందిస్తున్నారనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. నెల్లూరు డాక్టర్లు క్లీనిక్‌లు, మందుల షాపుల నిర్వహణతోపాటు వివిధ పరీక్షల నిమిత్తం ఆస్పత్రులకు వచ్చే రోగులను రకరకాలుగా దోచుకొంటున్నారు. ఆపరేషన్ల పేరిట వారు చేస్తున్న జిమ్మిక్కులు విస్తుపోయేలా ఉన్నాయి. ఇవన్నీ చాలవంటూ మహిళా రోగులపై అత్యాచారాలకు దిగడం ఘోరం.








నెల్లూరు వేద సంస్కృత పాఠశాలలో ఓటేయను క్యూలో నిలబడ్డ ఓటర్లు.


సంగం హైస్కూల్‌లో ఓటేయను బారులు తీరిన ఓటర్లు.


నెల్లూరు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ఉమెన్స్ అకాడమీలో డిగ్రీ చదివి ఉత్తమ మార్కులు సాధించిన విద్యార్థినులతో కళాశాల కరస్పాండెంట్ జెవి.రెడ్డి మరియు అధ్యాపక సిబ్బంది.


నెల్లూరు సెయింట్ జోసఫ్ ఇంగ్లీషు మీడియం స్కూల్‌లో ఓటేసి వస్తున్న కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి దంపతులు.

# బెల్టు బ్రాందీ షాపుల జోరు!

## తోటపల్లిగూడూరులో ఎటు చూసినా అవే

తోటపల్లిగూడూరు మండలంలో బెల్టుషాపుల జోరు అధికమయ్యింది. ఏ గ్రామంలో చూసినా కూల్‌డ్రింక్ షాపుల మాదిరిగా వెలసిన బెల్టుషాపులే కన్పిస్తున్నాయి. ఇబ్బడిముబ్బడిగా వున్న బెల్టుషాపుల వల్ల తరచూ గ్రామాల్లో గొడవలు జరుగుతున్నా ఎక్సైజ్ అధికారులుగాని, పోలీసులుగాని పట్టించుకొన్న దాఖలాలు లేవు. ఉన్నతాధికారులు బెల్టుషాపులను మూసివేయిస్తామని ఆర్భాటపు ప్రకటనలు చేయడం తప్ప సరైనచర్యలు చేపట్టడంలో విఫలం కావడంతో మూడు పువ్వులు ఆరు కాయల్లా వుంది బెల్టు షాపుల వ్యాపారం. మండలంలోని వివిధ ప్రాంతాల్లో ఏర్పాటై వుండే బెల్టుషాపులను పరికిస్తే ఎంతగా వేళ్లూనికొని పోతున్నాయో అర్థమవుతుంది. వరిగొండ పంచాయితీ దేవళ్లమిట్టలో రెండు బెల్టుషాపులున్నాయి. చిన్నమిషన్ సెంటర్‌లో నాలుగు, పెద్దమిషన్ సెంటర్‌లో రెండు, విలుకానిపల్లి, పొట్లపూడి కేంద్రంగా నాలుగు, చెన్నపల్లిపాళెం కేంద్రంగా మూడు, కోడూరు కేంద్రంగా ఆరుకు పైగా బెల్టుషాపులు నడుస్తున్నాయి. కోడూరు బీచ్‌లో అయితే ఈ బెల్టుషాపుల వల్ల పర్యాటకులకు తీవ్ర ఇబ్బందులు ఎదురౌతున్నాయి. మద్యం సేవించి అక్కడకు వచ్చే వారిపట్ల అసభ్యంగా ప్రవర్తిస్తుండడంతో తరచూ గొడవలు జరుగుతున్నాయి. ఇక ఖాళీ ప్రదేశాలను మందుబాబులు మద్యం సేవించేందుకు అనువుగా చేసుకోవడంతో చాలా గ్రామాల్లోని ప్రజలు తిరగాలంటేనే హడలిపోతున్నారు. కాకుపల్లి తూము, రియల్ ఎస్టేట్ ఖాళీ ప్లాట్లు కేంద్రాలుగా రాత్రింబవళ్లు త్రాగుబోతులు చేసే వీరంగంతో స్థానికంగా వుండే కుటుంబాలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నాయి.

● ముత్తుకూరు

# రోడ్లు ఘోరం!

ముత్తుకూరు మండలంలోని పలు రహదారులు ప్రమాదభరితంగా మారాయి. పారిశ్రామికంగా మండలం అభివృద్ధి చెందుతున్నప్పటికీ రహదారులు మాత్రం బాగుపడడం లేదు. గుంటలు మిట్టలుగా వున్న రోడ్లకు తోడు రోడ్డు మలుపులు వాహనాలపై వెళ్లే వారికి మృత్యుద్వారాలను తలపిస్తున్నాయి. మండలంలోని కప్పలదొరువు గ్రామం నుంచి పంటపాళెం వెళ్లేరోడ్డు మార్గంలో వుండే మలుపులు ప్రమాదకరంగా వున్నాయి.

## పేరుకే పారిశ్రామిక కేంద్రం

వల్లూరు చెరువు వెంబడి నాలుగు చోట్ల ఇలాంటి మలుపులు వున్నాయి. కోటి రూపాయలు ఖర్చు చేసి రోడ్లు నిర్మించినప్పటికీ మలుపుల వద్ద ప్రమాద సూచికలు ఏర్పాటు చేయకపోవడంతో తరచూ ప్రమాదాలకు గురై ప్రాణాలు పోగొట్టుకొంటున్నారు. ఇప్పటికైనా అధికారులు నిద్రమేల్కొని రోడ్డు మలుపుల వద్ద ప్రమాద సూచిక బోర్డులను ఏర్పాటు చేయాలని వివిధ ప్రాంతాల ప్రజలు కోరుకొంటున్నారు.

# కావలి ఆర్టీసి డిపో అధ్వాన్నం!

## అన్నీ సమస్యలే!

కావలి ఆర్టీసి డిపో పరిస్థితి అధ్వాన్నంగా తయారైంది. కండిషన్‌లో వుండే బస్సులు లేక, కిటికీ కమ్ములు వూడి, అద్దాలు పగిలి, సీట్లు విరిగిన బస్సులు గ్రామీణ ప్రాంతాల్లో తిరుగుతుండడంతో ప్రయాణీకులు తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. బస్సుల బాగోగులు, సిబ్బంది పనితీరు పట్టించుకొనే వారే లేకుండా పోవడంతో ఎవరికి వారే యమునా తీరే అన్నచందంగా వుంది. ఏ బస్సు ఎన్ని గంటలకు వస్తుందో, ఎప్పుడు పోతుందో సరైన సమాధానం చెప్పే దిక్కులేదు. గ్యారేజ్‌లో పరిస్థితి మరింత అధ్వాన్నం. బస్సుల మరమ్మత్తులకు గురై గ్యారేజ్‌కు వచ్చిన సందర్భాలలో సరైన సామగ్రి లేకపోవడం, చివరకు డస్టర్‌లు లేని స్థితి. ఇక ఆర్టీసి బస్టాండ్ ఆవరణలో అపరిశుభ్రత తాండవిస్తోంది. మరుగుదొడ్ల మరీ ఘోరం. శుభ్రపరిచేవారు లేక దుర్గంధం వెదజల్లుతుండడంతో ప్రయాణీకులు నరకాన్ని చవిచూస్తున్నారు. బస్సుల కోసం వేచి చూసేవాళ్ల పడే బాధలు వర్ణనాతీతం. సామాన్లకు భద్రత కరువైంది. దొంగల సంచారం అధికం కావడంతో ప్రయాణీకుల బ్యాగులు, నగలు చోరీలకు గురవుతున్నాయి. కూర్చోనేందుకు బెంచీలు లేవు. వున్న ఒకటి అర వాటిల్లో ఆకతాయిలు, త్రాగుబోతులు ఆక్రమించుకొని వుంటుండడంతో నిలబడే వుండాల్సి వస్తోందని ప్రయాణీకులు వాపోతున్నారు. సుదూర ప్రాంతాలకు వెళ్లే బస్సులన్నీ ఈ బస్టాండ్‌కు వస్తుంటాయి. నిత్యం అధిక సంఖ్యలో ప్రయాణీకులు రాకపోకలు సాగించే డిపో గురించి అధికారులు పట్టించుకోకపోవడం వారి నిర్లక్ష్యాన్ని తెలియజేస్తోంది.

# ఎస్‌బిఐ పనితీరే వేరు!

## ఇబ్బందిపడుతున్న ప్రజలు

తోటపల్లి గూడూరు స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా బ్రాంచి కార్యాలయం పనితీరు అధ్వాన్నంగా వుంది. సహజంగా స్టేట్‌బ్యాంక్ అన్నా, అక్కడి సిబ్బంది అన్నా అందరికి గౌరవం, సేవలు సక్రమంగా అందుతాయన్న నమ్మకం ప్రజల్లో వుంది. ఇందుకు భిన్నంగా వుంది ఈ బ్యాంక్ పనితీరు. బ్యాంకు వాతావరణం ఖాతాదారులకు ఇబ్బందికరంగా వుంటోంది. క్యూలో నిలబడాలన్నా వీలుండని పరిస్థితి ఏర్పడుతోంది. ఇక సిబ్బంది పనితీరు చాలా నెమ్మదిగా వుంటోందంట. క్యాష్ కౌంటర్‌లో నగదు చెల్లించాలన్నా, డ్రా చేయాలన్నా గంటల తరబడి నిరీక్షించాల్సి రావడంతో వివిధ పనులపై వెళ్లేవారు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. వయోవృద్ధులు అయితే అంతంతసేపు నిలబడలేక అల్లాడిపోతున్నారు. అసిస్టెంట్ మేనేజర్‌స్థాయి అధికారులు ఇద్దరున్నా ఖాతాదారుల సందేహాలు తీర్చే ఓపికా, తీరికా లేదు. డిడిలు కట్టాలని వచ్చే వారికి ప్రింటర్ పనిచేయడం లేదనే సమాధానం ఎప్పుడూ వినవస్తుంటుంది తప్ప దానికి ప్రత్యామ్నాయం చూపకపోవడంతో డిడిలు కట్టేందుకు వచ్చేవారు తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. సాధారణంగా క్యాష్‌కౌంటర్లు రెండు వుండాల్సి వుండగా ఇక్కడ ఒకే కౌంటర్ వుండడంతో లావాదేవీల్లో జాప్యం జరుగుతోంది. సిబ్బంది అంతా దీర్ఘకాలంగా ఇక్కడ పనిచేస్తున్న మెసెంజర్‌పై ఆధారపడి పనులు నిర్వహించడాన్ని ఖాతాదారులు విమర్శిస్తున్నారు. ఇక పైరవీకారులకు బ్యాంక్‌లో స్థానం వుండడంతో వారిని ఆశ్రయించిన వారికి త్వరితగతిన పనులు జరుగుతున్నాయన్న ఆరోపణలు వినవస్తున్నాయి. ఉన్నతాధికారులైనా జోక్యం చేసుకొని బ్యాంకు పనితీరును మెరుగుపరచాలని స్థానికులు కోరుకొంటున్నారు.

# బ్యాంకును ముట్టడించిన మహిళలు!

## భయపడిపోయిన అల్లూరు బ్యాంకు సిబ్బంది

రుణం ఇస్తామని నెలలతరబడి తిప్పుకొంటున్న బ్యాంకు అధికారుల తీరుతో విసిగి వేశారిన మత్స్యకార మహిళలు బ్యాంకును ముట్టడించిన వైనం అల్లూరు మండలం ఇస్కపల్లి పంచాయితీలో జరిగింది. ఈ ప్రాంతంలో గల సిండికేట్ బ్యాంకులో రుణం పొందేందుకు గత కొంతకాలంగా మత్స్యకార మహిళలు బ్యాంకుచుట్టూ తిరుగుతున్నారు. బ్యాంకు అధికారులు వీరికి రుణం చెల్లించేందుకు 8వేల రూపాయలు కట్టించుకొన్నారట. ఎప్పుడు పోయినా ఇదిగో అదిగో అంటూ తిప్పి పంపుతుండడంతో సహనం కోల్పోయిన మహిళలు చివరకు ఆందోళనకు దిగారు. అధికసంఖ్యలో మహిళలు ఒక్కసారిగా బ్యాంకును ముట్టడించి, సిబ్బంది ఎవరూ బ్యాంకులోకి వెళ్లకుండా అడ్డుకొని తాళాలు వేయడంతో ఉద్రిక్తత చోటు చేసుకొంది. ఒక దశలో మహిళల ఆగ్రహాన్ని చూసి ఆందోళన చెందిన బ్యాంక్ అధికారులు సమాచారాన్ని ఇస్కపల్లిలో వున్న శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావుకు చేరవేయడంతో ఆయన బ్యాంక్ వద్దకు వచ్చి ఆందోళన చేస్తున్న మహిళలు, బ్యాంక్ అధికారులతో మాట్లాడి ఎన్నికలు అయిన తర్వాత అందరికి రుణం అందేలా చూస్తామని హామీ ఇవ్వడంతో మత్స్యకార మహిళలు శాంతించారు.



పదవ తరగతి పరీక్షా ఫలితాలలో మంచి మార్కులు సాధించిన నెల్లూరు నేతాజి పైలెట్ హైస్కూల్ విద్యార్థిని వేదశ్రీని అభినందిస్తున్న డిఇఒ రామలింగం. ప్రక్కన స్కూల్ అధినేత సుబ్బారెడ్డి.

# దిక్కులేని దేవుళ్లు!

**జిల్లాలోని మెజార్టీ దేవాలయాల్లో ఇదే పరిస్థితి.**

కోట్లాది రూపాయలు ఆస్తులున్నా దీపధూప నైవేద్యాలకు నోచుకోని పరిస్థితి జిల్లాలోని దేవాలయాలకు ఎదురౌతోంది. వివిధ ప్రాంతాల్లో పేరొందిన ఆలయాలకు వేలాది ఎకరాలు వున్నప్పటికి చిల్లిగవ్వ లేని పరిస్థితి దేవుళ్లది. ఇక వీటిని నమ్ముకొన్న పూజారుల కష్టాలు అన్ని ఇన్ని కావు. ఉదయం లేచింది మొదలు నిద్రించేవరకు నిత్యం దేవుడి సన్నిధిలో గడిపే పూజారులకు ఇచ్చే అరకొర జీతాలు సరిగా అందక కుటుంబాలను పోషించుకోలేక తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. దేవాలయ నిర్వహణ, జీతభత్యాలను చూడాల్సిన దేవాదాయశాఖ అధికారులు తమకేమీ పట్టనట్లు వ్యవహరిస్తుండడంతో దేవుడితోపాటు పూజారులకు దిక్కు లేకుండా పోయింది. వివిధ ఆలయాలలో వుండే హుండీల్లో వచ్చిన సొమ్మును క్రమం తప్పకుండా లెక్కించి తీసుకెళ్లే అధికారులు ఆ ఆలయాల్లో కనీస సౌకర్యాల కల్పన గురించి పట్టించుకోవడం లేదు. దీపధూప నైవేద్యాలకు దాతల కోసం ఎదురు చూడాల్సిన పరిస్థితి ఏర్పడుతోంది. చాలాచోట్ల విద్యుత్ బిల్లులు చెల్లించలేనిస్థితి. ఉన్నతాధికారులు జోక్యం చేసుకొని దేవుళ్లకు సక్రమంగా దీప ధూపాలు నిర్వహించే ఏర్పాట్లు చూడడంతోపాటు పూజారులకు జీతాలు సక్రమంగా అందేలా చర్యలు చేపట్టాలని పలువురు కోరుకొంటున్నారు.

# కాలుష్య భూతం కోరల్లో ముత్తుకూరు!

## ప్రభుత్వం స్పందించాలి!

ముత్తుకూరు మండలం పారిశ్రామికంగా ఎంత అభివృద్ధి చెందుతుందో అదే తీరులో కాలుష్యం కోరల్లో చిక్కుకొని విలవిల్లాడుతోంది. మండలంలో ఎటు చూసినా వివిధ ప్రాంతాల్లో ఏర్పాటవుతున్న పరిశ్రమలు, విద్యుత్ కేంద్రాలు కన్పడుతున్నాయి. ఇప్పటికే ఎన్నో పరిశ్రమలు ప్రారంభించబడ్డాయి. థర్మల్ విద్యుత్ ప్రాజెక్టుల వలన ఎంతమేర కాలుష్యం వెదజల్లుతుందనే దానిపై ఇప్పటికే పలువురు శాస్త్రవేత్తలు, పర్యావరణ నిపుణులు ఆందోళన వ్యక్తం చేసివున్నారు. ఇక పామాయిల్ ఫ్యాక్టరీల వలన ఈ ప్రాంతంలోని ప్రజలు పడుతున్న ఇబ్బందులు తీవ్రంగా ఉన్నాయి. రాత్రివేళల్లో ఈ ఫ్యాక్టరీల నుంచి వెలువడే కాలుష్యం, దుర్గంధ భరితమైన వాసన సమీపంలోని 15 కిమీ వరకు వ్యాపిస్తుండడంతో ప్రజలు తీవ్రమైన సమస్యలు ఎదుర్కొంటున్నారు. ఇంతగా పరిశ్రమల ఏర్పాటుతో ముత్తుకూరు మండలంలో కాలుష్యం రోజురోజుకు అధికమై ప్రజల ప్రాణాలతో చెలగాటమాడుతున్నా దీనిపై చర్యలు చేపట్టాల్సిన కాలుష్య నియంత్రణ మండలి అది తమ పనేకానట్లు వ్యవహరిస్తుందనే విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. ప్రజల అనారోగ్యాలపై ప్రభావం చూపేవిధంగా కాలుష్యాన్ని వెదజల్లుతున్న ఫ్యాక్టరీలను తనిఖీ చేసి కాలుష్యాన్ని నియంత్రించేందుకు చర్యలు చేపట్టాలని మండల ప్రజలు అధికారులను కోరుకొంటున్నారు.

# మహిళా దొంగలున్నారు!

ఆభరణాలు కొనేవారి మాదిరిగా తిరుగుతూ వివిధ ప్రాంతాల్లో దొంగతనాలకు పాల్పడుతున్న మహిళా దొంగలను కలిగిరి పోలీసులు వలవేసి పట్టుకొన్నారు. వీరి వద్ద నుంచి 2లక్షలకు పైగా విలువ చేసే వెండి వస్తువులను స్వాధీనం చేసుకొన్నారు. గుంటూరుకు చెందిన పొదిలి సుబ్బులు, తన్నీరు విజయమ్మ, తన్నీరు లక్ష్మి, పార్వతి, శాంతి అనేవారు చాలాకాలంగా ముఠాగా ఏర్పడి ప్రకా

**జర జాగ్రత్త!**

శం, నెల్లూరు జిల్లాల్లో బంగారు అంగళ్లను టార్గెట్ చేసుకొని చోరీలు చేస్తున్నారు. పొదిలి, పామూరు, వింజమూరుకు చెందిన బంగారు అంగళ్లలో దొంగతనాలు చేయడంతోపాటు నెల్లూరులో ఆటోల్లో ప్రయాణిస్తున్న ప్రయాణికుల నుంచి నగలు తస్కరించి వున్నారట. వీరి కదలికలపై నిఘాపెట్టిన పోలీసులు ఎట్టకేలకు మహిళా దొంగలను అరెస్టు చేయగలిగారు.



# బుకింగ్ క్లర్క్ ఏడి?

## తడ రైల్వే స్టేషన్‌లో ప్రయాణీకుల పాట్లు!

తడ రైల్వేస్టేషన్‌లో టిక్కెట్ కౌంటర్ వద్ద బుకింగ్ క్లర్కు లేకపోవడంతో ఇబ్బందులు ఎదురౌతున్నాయి. నిత్యం వివిధ ప్రాంతాలకు వెళ్లేవారు ఈ స్టేషన్‌కు వస్తుంటారు. కౌంటర్‌లో చాలాకాలంగా క్లర్క్ లేకపోవడం, స్టేషన్‌మాస్టరే అన్ని విధులు నిర్వర్తించాల్సి రావడంతో తిప్పలు తప్పడం లేదు. ఆదివారం, ఇతర సెలవు దినాల్లో మద్రాస్, నెల్లూరు వైపు వెళ్లే ప్రయాణీకులు అధికంగా వుంటారు. టిక్కెట్ల కోసం బారులు తీరిన ప్రయాణీకులు కన్పిస్తారు. రైల్వే ఉన్నతాధికారులు స్పందించి రెగ్యులర్ బుకింగ్ క్లర్క్‌ను నియమించి తడ స్టేషన్‌లో ప్రయాణీకుల సమస్యలను పరిష్కరించాల్సి వుంది.

# మెట్రో రైళ్ల తయారీ!

**శ్రీ సిటీలో కొత్త పరిశ్రమ**

ఫ్రాన్స్‌కు చెందిన ఆల్‌స్టామ్ కంపెనీ మెట్రోరైళ్ల తయారీకి శ్రీకారం చుట్టింది. శ్రీసిటీలో దీనికి సంబంధించిన నిర్మాణ పనులు ప్రారంభం అయ్యాయి. ఈ తయారీని లాంఛనంగా ప్రారంభించిన కంపెనీ ఎండి సత్యమూర్తి కృష్ణస్వామి మాట్లాడుతూ ప్రస్తుతం రైళ్ల నిర్మాణం ప్రాథమిక దశలో వుందని, సెప్టెంబర్ 27 నుంచి అధికారికంగా ప్రారంభమౌతుందన్నారు. మొదటి రైలును ఫిబ్రవరి నాటికి తయారు చేసి ఇవ్వాలన్నది లక్ష్యమన్నారు. మొదటగా చెన్నైకు 42 మెట్రోరైళ్లను తయారుచేసి అందించడంతోపాటు తర్వాత హైదరాబాద్, ఢిల్లీ, బెంగుళూరు నగరాలకు ఇక్కడి నుంచే మెట్రోరైళ్లను తయారు చేసి ఇస్తామన్నారు. శ్రీసిటికి వచ్చిన సత్యమూర్తికి సంస్థ తరపున సన్నారెడ్డి సనత్‌కుమార్ స్వాగతం పలికారు. ఈ కార్యక్రమంలో ఆల్‌స్టామ్ సిబ్బంది బాలమురగన్, భరత్ తదితరులు పాల్గొన్నారు.

# నీరుగారిన టేకు చెట్ల పెంపకం!

## ఉద్యానవన పెంపకం మరీ

ఉపాధిహామీ పథకంలో భాగంగా ఉద్యానవనశాఖ ద్వారా జిల్లావ్యాప్తంగా పొలంగట్లపై వేసిన టేకు మొక్కలు ఆలనాపాలనా లేక ఎండిపోతున్నాయి. ఈ మొక్కల పంపిణీకి రూ.10కోట్లకు పైగా వ్యయం చేసినట్లు సమాచారం. ఈ ఏడాది జిల్లాలో 18లక్షల టేకు మొక్కలు పంపిణీ చేశారు. ఒక్కో మొక్కను రూపాయి వంతున నర్సరీల నుంచి కొనుగోలు చేసి రైతాంగానికి ఉచితంగా అందించారు. వీటిని పొలం గట్లపై నాటడానికి మొక్కకు 8రూపాయలు వంతున ఉపాధి హామీ పథకం క్రింద కోటి రూపాయలకు పైగా ఖర్చు చేశారట. నర్సరీల నుంచి కొన్న ఈ మొక్కలను పెంచేందుకు ఒక్కో మొక్కకు 54రూపాయలు అదనంగా ఖర్చు చేయడంతో మొత్తం టేకు మొక్కల పంపిణీకి 10కోట్ల రూపాయల వ్యయం అయిందట. దీనిపై పర్యవేక్షణ కొరవడడంతో కోట్లాది రూపాయలు ఖర్చు చేసి పంపిణీ చేసిన మొక్కలు ఎండిపోయాయి.

# సణుగుడు

## * మసకబారుతున్న టౌన్‌హాల్ ప్రతిష్ట.
## * అభిమానుల ఆగంతో సినిమాహాళ్లపై అపనిందలు.

నెల్లూరు టౌన్‌లో మిగిలి వున్న చరిత్ర ప్రాధాన్యత సంస్థలలో టౌన్ హాల్ చాలా ముఖ్యమైనది. దానితో చరిత్ర మాత్రమే కాదు, నెల్లూరు పుర ప్రజల సాంస్కృతిక, రాజకీయ వికాసం కూడా ముడిపడి వుంది. మహాత్మా గాంధీ సహా నెల్లూరు సందర్శించిన జాతీయ నేతలందరూ ఈ వేదిక మీద నుంచే తమ సందేశాలు విన్పించారు. స్వాతంత్ర్య సమర శంఖం పూరించారు. విప్లవ భావాలు ప్రసరింపచేశారు. ఆధ్యాత్మిక బోధనలు చేశారు. హేతువాద వాదనలు విన్పించారు. ఇందిరమ్మ కూడా ఒకసారి టౌన్‌హాల్ ఆవరణంలోని వర్ధమాన సమాజ మందిరంలో ఒక పత్రికా విలేకరుల సమావేశంలో ప్రసంగించారు. మొరార్జీ దేశాయి, బిపి.మౌర్య, హెచ్ఎన్.బహుగుణ, జార్జి ఫెర్నాండెజ్, పాతకాలం విప్లవ వీరుడు బిపిన్ చంద్రపాల్ వంటి లబ్ద ప్రతిష్టులంతా ఈ వేదిక మీద నుంచి నెల్లూరు ప్రజలలో రాజకీయ చైతన్య దీపికలు వెలిగించారు. టౌన్‌హాల్‌లో ప్రదర్శన ఇవ్వని ప్రసిద్ధ కళాకారుడు ఆంధ్ర దేశంలో లేడనడం అతిశయోక్తి కాదు. ఎన్ని వేల నాటికలు, నాటకాలు ప్రదర్శితమై వుంటాయో లెక్క పెట్టడం సాధ్యం కాదు. కవిత్రయ జయంతులు టౌన్‌హాల్‌కు అజరామర కీర్తిని ఆర్జించి పెట్టాయి. వేదం వేంకటరాయ శాస్త్రి, దీపాల పిచ్చయ్య శాస్త్రి, దుర్భా సుబ్రహ్మణ్యం, దేవులపల్లి కృష్ణ శాస్త్రి, శ్రీశ్రీ... వారు వీరనే తేడా లేకుండా ఆంధ్ర సాహితీ వనంలో విరబూసిన దివ్య కుసుమాలన్నీ టౌన్‌హాల్ వేదిక ద్వారా నెల్లూరు వాసులకు సారస్వత సువాసనలు లభింపచేశాయి. శంకరాచార్యులతో సహా ఎందరెందరో పూజ్యనీయులు ఈ ఆవరణాన్ని తమ పాద స్పర్శతో పునీతం చేశారు. సత్యసాయి బాబా మహిమలు వట్టి గారడీలని డాక్టర్ కోవూర్ చెప్పి వెళ్లింది ఈ వేదిక మీద నుంచే.

రాజకీయంగా, సాంస్కృతికంగా, సాహిత్యపరంగా నెల్లూరు నగరంతో ఇంతగా మమేకమైన సంస్థ వేరొకటి లేదు. నెల్లూరు నగరానికి అదొక సువర్ణ ఆభరణం వంటిది. నెల్లూరుకు ఇంత గొప్ప భవనాన్ని అందించిన పుణ్యపురుషుడు రావు బహదూర్ రేబాల లక్ష్మీనరసారెడ్డి. నార్త్‌మోపూరు గ్రామానికి చెందిన జమీందారీ వంశస్తుడాయన. ఆ రోజుల్లోనే టౌన్‌హాల్ నిర్మాణానికి 60వేల రూపాయలు ఖర్చు చేశాడాయన. పుట్టి వడ్లు పాతిక రూపాయలు కూడా చేయని రోజులవి. ఆ రోజులలో వ్యవసాయం తప్ప ఇతర రాబడి అంటూ ఏదీ వుండేది కాదు. ఎకరాకు పుట్టెడు వడ్లు పండడమే పెద్ద గొప్ప. అప్పటి వ్యవసాయ పరిజ్ఞానం అంతవరకు మాత్రమే వుండేది. ఆ లెక్కలో ఆయన ఆనాడు ఖర్చు చేసిన 60 వేల రూపాయల విలువ ఎంత గొప్పదో వూహించలేము.

బ్రిటీష్ సామ్రాజ్యాధిపతి కింగ్ జార్జ్ ఫైవ్ పట్టాభిషేక మహోత్సవానికి గుర్తుగా నిర్మించిన భవనం ఇది. 1910 మే నెలలో ఆయన బ్రిటీష్ రారాజుగా పదవిలోకి వచ్చాడు. 1911 డిసెంబర్‌లో భారతదేశానికి వచ్చి, ఇంపీరియల్ క్రౌన్ ఆఫ్ ఇండియా అనే కిరీటాన్ని ధరించి, భారతదేశానికి చక్రవర్తిగా గుర్తింపు పొందాడు. కింగ్ జార్జ్ ఫైవ్‌కు భారతదేశ చరిత్రతో విడదీయరాని బంధం వుంది. దేశ రాజధానిని కలకత్తా నగరం నుంచి ఢిల్లీకి మార్చింది ఆయనే. ఇప్పటి రాష్ట్రపతి భవన్, పార్లమెంట్ తదితరాలున్న న్యూఢిల్లీకి రూపకల్పన చేసింది కూడా ఆయనే. తన భారతదేశ పర్యటనలో చక్రవర్తుల విలాసాలంటే ఎట్లా వుంటాయో చూపించి వెళ్లాడాయన. నేపాల్ సరిహద్దులలోని అడవులలో ఆయన పది రోజుల వేట వినోదం చేసి, 21 పులులు, 8 ఖడ్గ మృగాలను హతమార్చాడట. పేషంట్స్ అనే చిత్ర వర్ణాల పక్షి మీద ఆయన కన్ను పడింది. ఆరంటే ఆరు గంటలలో వెయ్యి పక్షులను తన తుపాకికి బలి చేశాడట. ఇప్పుడైతే అతగాడిని కిరాతకుడిగా జమ కట్టి యావత్ సమాజం వెలి వేసి వుండేది. కానీ అవి చక్రవర్తుల రాజ్యాలు కదా? అందువల్ల ఆయన పట్టాభిషేకానికి గుర్తుగా 1911 లోనే మన టౌన్‌హాల్ నిర్మాణం మొదలు పెట్టారు. నాలుగేళ్లలో పూర్తి చేసి, 1915లో ప్రారంభింప చేశారు. అప్పుడే వర్ధమాన సమాజ గ్రంథాలయానికి కూడా అంకురార్పణ జరిగింది. తర్వాతి కాలంలో రాష్ట్రంలోని ప్రసిద్ధ గ్రంథాలయాలలో ఒకటిగా దానికి గుర్తింపు లభించింది.

ఇంతటి ఘనతర చరిత్ర కల్గిన టౌన్‌హాల్ ప్రస్తుత దుస్థితి చూస్తే జాలి కల్గుతున్నది. పదేళ్ల క్రితం వదాన్యుడైన జెఎస్.రెడ్డి దాని దుస్థితి చూసి, దాదాపు 45 లక్షల రూపాయలు ఖర్చుపెట్టి, కొంతలో కొంత మరమ్మత్తు చేయించాడు. ఆయన దాతృత్వాన్ని సక్రమంగా వినియోగించుకొంటే టౌన్‌హాల్‌కు కనీసం మరొక యాభై ఏళ్ల దీర్ఘాయుష్షు లభిస్తుంది. కానీ దురదృష్టవశాత్తు అది జరగడం లేదు. నిర్వహణ విషయంలో లోటు పాట్లు చాలానే కన్పిస్తున్నాయి.

టౌన్‌హాల్‌కు అందం – దాని చుట్టూ వున్న విశాల ప్రాంగణం. కానీ ముందున్న చిన్న వినాయ

**డోలేంద్ర**

కుడి గుడి మంచి రాబడి వనరుగా మారడంతో పడమటి వైపు మొత్తం మూసినట్లుగా గుడిని విస్తరించేశారు. స్వర్గీయ ఆర్ఎల్.రెడ్డి ఒక బ్రతకలేని బడుగు

కొరవ 14వ పేజీలో

## మేకపాటి కోరిక తీరలేదు!

మేకపాటి రాజమోహన్‌రెడ్డి లోక్‌సభకు రాజీనామా చేయడానికి ప్రధాన కారణం – ఉపఎన్నికలలో భారీ మెజార్టీతో గెలిచి రికార్డు సృష్టించాలని. కడప ఉపఎన్నికలో జగన్‌కు వచ్చినన్ని ఓట్లు రావాలని కలలు కన్నారాయన. అయితే ఆ కోరిక నెరవేరలేదు. కడపలో జగన్‌కు 63.67 శాతంతో 6,55,496 ఓట్లు వచ్చాయి. 5లక్షలా 21వేల మెజార్టీ సాధించాడు. మేకపాటికి కేవలం 54.59 శాతం ఓట్లు మాత్రమే పోలైనాయి.

## మహిధర్‌రెడ్డి లాలూచీ

కందుకూరు నియోజకవర్గంలో మునిసిపల్ మంత్రి మానుగుంట మహిధర్‌రెడ్డి జగన్ పార్టీతో లాలూచీ పడ్డాడని మొదటి నుంచి అనుమానిస్తుండినారు. ఆయన స్వగ్రామం మాచవరం. అక్కడ ఆయన మాట శిలాశాసనం. ఏ ఎన్నికైనా, మహిధర్ చెప్పిన వారికే ఓటు వేయడం అలవాటు. కానీ ఈసారి ఆ గ్రామంలో జగన్ పార్టీకి 2097 ఓట్లు వస్తే, కాంగ్రెస్‌కు కేవలం 900 ఓట్లు వచ్చాయి. మంత్రిగారి లాలూచీ భాగోతానికి ఇదొక నగ్న నిదర్శనం.

### లోక్‌సభకు నియోజకవర్గాల వారీగా పోలైన ఓట్ల వివరాలు

| అసెంబ్లీ సెగ్మెంట్ | వైఎస్‌ఆర్‌సిపి | కాంగ్రెస్ | టిడిపి | సిపిఎం | మెజార్టీ |
|---|---|---|---|---|---|
| కందుకూరు | 66646 | 37700 | 34012 | 1442 | 28946 |
| కావలి | 78579 | 30714 | 28101 | 1732 | 47865 |
| ఆత్మకూరు | 80724 | 47587 | 8257 | 2671 | 33137 |
| కోవూరు | 96927 | 43459 | 17114 | 5244 | 53468 |
| నెల్లూరు సిటీ | 62482 | 19380 | 12300 | 2012 | 43102 |
| నెల్లూరు రూరల్ | 73421 | 29481 | 12138 | 3033 | 43940 |
| ఉదయగిరి | 75867 | 34989 | 41996 | 1725 | 33871 |
| మొత్తం | 534646 | 243310 | 153918 | 17859 | 291745 |

## శాతంలో కామాక్షయ్య – సంఖ్యలో మేకపాటి రికార్డు!

ఇప్పటివరకు నెల్లూరు లోక్‌సభకు జరిగిన ఎన్నికలలో అత్యధిక శాతం ఓట్లు సంపాదించిన అభ్యర్థిగా దొడ్డవరపు కామాక్షయ్య రికార్డు ఇప్పటి వరకు చెక్కు చెదర లేదు. 1980లో జరిగిన ఎన్నికలలో ఆయనకు మొత్తం పోలైన ఓట్లలలో 71.05 శాతం లభించాయి. అంతకు క్రితం కూడా అంతే. 1971లో 66.18 శాతం, 1977లో 66.14 శాతం ఓట్లు సాధించాడు కామాక్షయ్య. 1971లో ఆయనతో పోటీ చేసిన అప్పటి జనసంఘ్ అభ్యర్థి బంగారు లక్ష్మణ్‌కు కేవలం 17శాతం ఓట్లు; 1977లో పోటీ చేసిన సిపిఎం అభ్యర్థి టిపి.భానురాజుకు 16.19 శాతం ఓట్లు మాత్రమే లభించాయి. ఇప్పుడు మేకపాటి రాజమోహన్‌రెడ్డికి 54.59 శాతం ఓట్లు లభించాయి.

అయితే ఓట్ల సంఖ్య రీత్యా చూస్తే మాత్రం ఇప్పటి ఎన్నికలలో మేకపాటి రాజమోహన్‌రెడ్డి సాధించింది అరుదైన రికార్డు. 2,91,745 ఓట్ల మెజార్టీ ఇప్పటి వరకు నెల్లూరు నుంచి పోటీ చేసిన ఎవరికీ రాలేదు. అందుకు కారణం మొత్తం ఓట్ల సంఖ్య పెరగడం.

లోక్‌సభ ఎన్నికలు మొదలైన 1951లో మొత్తం పోలైన ఓట్లు రెండు లక్షలా 7వేలు మాత్రమే. ఆ ఎన్నికలో బెజవాడ రామచంద్రారెడ్డి గారు కేవలం 1787 ఓట్ల మెజార్టీతో మాత్రమే గెలిచాడు. ఆయనకు 67582 ఓట్లు వస్తే, సమీపంగా వచ్చిన వెన్నెలకంటి రాఘవయ్య గారికి 65795 ఓట్లు వచ్చాయి. అప్పుడు మొత్తం ఓట్లు 3,48,698; ఇప్పుడు 13,17,451. అప్పటికి ఇప్పటికి ఓట్ల సంఖ్య దాదాపుగా నాలుగు రెట్లు పెరిగిందన్న మాట.

### నెల్లూరు లోక్‌సభకు రౌండ్‌వారీగా పోలైన ఓట్ల వివరాలు

| రౌండ్ | వైఎస్‌ఆర్‌సిపి | కాంగ్రెస్ | టిడిపి | సిపిఎం | మెజార్టీ |
|---|---|---|---|---|---|
| 1 | 35107 | 16659 | 9598 | 1572 | 18448 |
| 2 | 32063 | 15132 | 9224 | 1166 | 16931 |
| 3 | 31500 | 14161 | 9404 | 963 | 17339 |
| 4 | 29811 | 13584 | 7194 | 933 | 16227 |
| 5 | 28768 | 13298 | 8148 | 2248 | 15470 |
| 6 | 30411 | 13158 | 7608 | 581 | 17253 |
| 7 | 32738 | 14054 | 6996 | 475 | 18684 |
| 8 | 31887 | 12453 | 8909 | 796 | 19434 |
| 9 | 33333 | 12602 | 10888 | 869 | 20731 |
| 10 | 32362 | 13692 | 7958 | 1253 | 18670 |
| 11 | 31569 | 13758 | 7974 | 757 | 17811 |
| 12 | 29350 | 15162 | 9976 | 751 | 14188 |
| 13 | 33319 | 15948 | 12349 | 1790 | 17371 |
| 14 | 33437 | 16191 | 9285 | 1641 | 17246 |
| 15 | 28983 | 14817 | 8810 | 886 | 14166 |
| 16 | 22935 | 11154 | 6030 | 466 | 12781 |
| 17 | 19405 | 9864 | 7741 | 424 | 9541 |
| 18 | 13525 | 6325 | 4383 | 243 | 7200 |
| 19 | 3143 | 1298 | 1443 | 45 | 1700 |
| మొత్తం | 534646 | 243310 | 153918 | 17859 | 291745 |




అన్ని పనులు కలిసివస్తాయి. వృత్తి, వ్యాపార రంగాల వారికి అనుకూలం. నూతన వస్తు, వస్త్రాభరణాలు సమకూర్చుకొంటారు. పుణ్యక్షేత్ర సందర్శన వుంటుంది. ఉద్యోగులకు బదలీలు, ప్రమోషన్లుంటాయి. విద్యార్థులకు అనుకూల సమయం. వ్యవసాయదారులకు ఆర్థిక పరిస్థితి సామాన్యంగా వున్నప్పటికీ ఎటువంటి ఇబ్బందులుండవు. రాజకీయ రంగంలోని వారికి చక్కగా వుంటుంది.




తలపెట్టిన పనులలో సామాన్య ఫలితాలుంటాయి. కొన్ని కార్యక్రమాలు వాయిదాపడడం జరుగుతుంది. ఆర్థిక పరిస్థితి సామాన్యంగా వుంటుంది. ఋణ ప్రయత్నం చేయవలసి రావచ్చు. ఇంటి యందు సమస్యలు, భార్యాభర్తల మధ్య తగాదాలుంటాయి. వ్యవసాయ రంగంలోని వారికి అవసరానికి డబ్బు అందుతుంది. కళా, క్రీడా రంగాలలోని వారు వృత్తిపై శ్రద్ధ పెట్టాలి. అనుకూలత వుండదు.




పనులు సకాలంలో పూర్తయినా ఇబ్బందులుంటాయి. ఆర్థికంగా సామాన్యంగా వుంటుంది. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి ప్రభుత్వ సంబంధ చిక్కులు అధికమవుతాయి. సోదరీ, సోదరులతో మాట పట్టింపులుంటాయి. విద్యార్థులకు బాగుంటుంది. వ్యవసాయదారులకు సామాన్యంగా వుంటుంది. ఋణ సౌకర్యం పొందగలరు. కళా, క్రీడా, రాజకీయ రంగాలలోని వారికి అననుకూలం.




ఆర్థికంగా బాగుంటుంది. ఇంటా బయట అన్ని పనులు పూర్తిచేయగలరు. వ్యాపారులు సమస్యలలో చిక్కుకొని ధన వ్యయమౌతుంది. ఉద్యోగులకు బదలీలు, స్థానచలనం వుంటుంది. బంధుమిత్రులతో విరోధాలు ఏర్పడతాయి. కోర్టు వ్యవహారాలు వాయిదా వేసుకొనుట మంచిది. వ్యవసాయదారులకు సానుకూల పరిస్థితులేర్పడతాయి. రాజకీయాలలోని వారికి సమస్యలు, విరోధాలు, ధనవ్యయం.




గ్రహానుకూలతచే వృత్తి, వ్యాపారాలలో రాణింపు. అన్ని పనులు పూర్తవుతాయి. ఆర్థికస్థితి బాగుంటుంది. భూసంబంధ, స్థిరాస్తి విషయాలలో లబ్ధిపొందగలరు. విద్యార్థులకు బాగుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి అనుకోని సంఘటనలు మేలు కలుగిస్తాయి. పేరు ప్రఖ్యాతులు పొందగలరు. రాజకీయ రంగంలోని వారికి సోదర, బంధువర్గాలతో విభేదాలు, ధన నష్టం, పై వర్గాల ఒత్తిడి వుంటుంది.




గతవారం వలెనే చేసే పనులు కొంతవరకు పూర్తవుతాయి. స్వల్ప ఆర్థిక ఇబ్బందులు, ఆదాయానికి మించిన ఖర్చులు, వాహన ప్రమాదాలు వుంటాయి. ఉద్యోగులకు అధికశ్రమ, పై అధికారుల ఒత్తిడి, స్థానచలనం వుంటాయి. విద్యార్థులు విజయం సాధించగలరు. వ్యవసాయం చేసేవారికి ఆర్థికస్థితి స్థిరంగా వుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి వృత్తిపరమైన ఇబ్బందులుంటాయి.

# వారఫలాలు

తేది 16-06-2012 నుండి 22-06-2012 వరకు వృషభంలో గురు, శుక్ర, కేతువులు; మిథునంలో రవి, బుధులు; 22తేది నుండి బుధుడు కర్కాటకంలో; కన్యలో శని, 21తేది వరకు కుజుడు తదుపరి సింహంలో; వృశ్చికంలో రాహువు; మేష, వృషభ, మిథున, కర్కాటకాలలో చంద్రుడు సంచరిస్తారు.

## పంచాంగం

16తేది శని త్రయోదశి. కూర్మ జయంతి.
19తేది భౌమ్యామావాస్య, వట సావిత్రి వ్రతం.
20తేది కర్కాటకాయనం - దక్షిణాయనం ప్రారంభం.
21తేది జగన్నాథ రథయాత్ర ప్రారంభం. బోనాల పండుగ
22తేది షాబాన్ నెల ప్రారంభం.

### శుభ ముహూర్తాలు

ఆషాఢమాసం శూన్యమాసం కావడంతో వివాహాది శుభకార్యాలకు సుముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసాది సామాన్య శుభకార్యాలకు సుముహూర్తాలున్నాయి.

### జూన్ తిథులు

**జ్యేష్ఠ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 16 | శని | ద్వాదశి | ప | 01.42 గం.ల.వ |
| 17 | ఆది | త్రయోదశి | సా | 04.13 గం.ల.వ |
| 18 | సోమ | చతుర్దశి | సా | 06.32 గం.ల.వ |
| 19 | మంగళ | అమావాస్య | రా | 08.31 గం.ల.వ |

**ఆషాఢ శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 20 | బుధ | పాడ్యమి | రా | 10.05 గం.ల.వ |
| 21 | గురు | విదియ | రా | 11.52 గం.ల.వ |
| 22 | శుక్ర | తదియ | రా | 11.12 గం.ల.వ |

అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం
7/34, దొడ్డ సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.




తలపెట్టిన పనులలో ఆటంకాలు, ఆర్థిక ఇబ్బందులు వుంటాయి. ఇంటా బయట శత్రువులు అధికమౌతారు. ఉద్యోగులకు పై అధికారుల ఒత్తిడి అధికమౌతుంది. చాలా కష్టకాలం. విద్యార్థులు తగు జాగ్రత్తలు పాటించాలి. వ్యవసాయదారులకు ఆర్థికంగా సామాన్యంగా వుంటుంది. ఋణాలు అందుతాయి. రాజకీయ రంగంలోని వారికి ఆశాభంగం. పై వర్గాల ఒత్తిడి, ఆర్థిక నష్టం వుంటుంది.




గతవారం కంటే మేలు. వృత్తి, వ్యాపారాలలో ఆర్థిక లాభాలుంటాయి. రావలసిన బాకీలు వసూలవుతాయి. నూతన వస్తు, వాహన ప్రాప్తి. సంతాన సౌఖ్యం. స్థిరాస్తి విషయాలలో శత్రువులుగా వున్నవారు సహకరించగలరు. ఉద్యోగులకు ప్రయాణ సౌఖ్యం, సంఘంలో పేరు ప్రఖ్యాతులు పొందగలరు. వ్యవసాయదారులకు ధనాదాయం బాగుంటుంది. నూతన ఋణ ప్రయత్నాలు ఫలిస్తాయి.




పనులు సకాలంలో పూర్తి చేయగలరు. ఆర్థికంగా నిలదొక్కుకుంటారు. వృత్తి, వ్యాపారాలు కలసి వస్తాయి. అయితే ఇంటా బయట ఇబ్బందులు తప్పకపోవచ్చు. ఉద్యోగులకు పై అధికారుల నుండి ఇబ్బందులుంటాయి. విద్యార్థులు గట్టి ప్రయత్నం చేయవలసి వుంటుంది. వ్యవసాయదారులకు ఆర్థికస్థితి సామాన్యం. ఋణ ప్రయత్నాలు ఫలిస్తాయి. కళా, క్రీడా రంగాలలోని వారికి బాగుంటుంది.




అన్ని పనులలో విజయం సాధిస్తారు. అన్ని వర్గాల వారికీ ఆర్థిక లాభం వుంటుంది. కుటుంబ సౌఖ్యం, బంధుమిత్రులతో విందులు, వినోదాలు. నూతన పరిచయాల వల్ల శుభకార్య ప్రయత్నాలు నెరవేరడం స్పెక్యులేషన్ లాభిస్తుంది. ఉద్యోగులకు వ్యవహార విజయం. విద్యార్థులకు బాగుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి వృత్తిపరమైన పరిచయాలు లాభిస్తాయి. రాజకీయులకు అనుకూలం.




పనులలో ఆటంకాలు, ఊహించని సంఘటనలు జరగడం, శారీరక శ్రమ, ఆర్థిక నష్టాలుంటాయి. ప్రయాణాలలో శ్రద్ధ అవసరం. ఇంటా బయట శ్రమ, చిక్కులు, సమస్యలుంటాయి. వృత్తి, వ్యాపార లావాదేవీలలో ఆటంకాలు, ఉద్యోగులకు పై అధికారులతో ఇబ్బందులు వుంటాయి. వ్యవసాయదారులకు ఆర్థిక లాభాలు సామాన్యంగా వుంటాయి. కళా, క్రీడా, రాజకీయ రంగాల వారికి అనుకూలం.




గతవారం కన్నా బాగుంటుంది. తలపెట్టిన పనులు సకాలంలో పూర్తి చేస్తారు. అన్నింటా మంచే జరుగుతుంది. శుభకార్య ప్రయత్నాలకు శ్రీకారం చుడతారు. బంధుమిత్రులతో విందులు, వినోదాలలో పాల్గొంటారు. విద్యార్థులకు బాగుంటుంది. వ్యవసాయదారులకు ఆర్థికస్థితి మెరుగుపడుతుంది. రాజకీయ రంగంలోని వారికి వ్యవహారానుకూలత పెరిగి, క్రింది, పై వర్గాల అనుకూలత సాధిస్తారు.

# వాయువ్యం అగాధంతో మనఃక్షోభ!

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*టి.లక్ష్మీరాజ్యం — చెన్నై*

* *వాయువ్యం సెప్టిక్ ట్యాంకు ఉన్నది. ఒత్తిళ్లె క్కువగా ఉన్నాయి. అయితే నలభై రోజులు తియ్య లేము.*

అగాధమైన వాయువ్యం మనఃక్షోభకు కారణం. అంటు ఉన్నందున వెంటనే నిర్ణయించిన యంత్రాన్ని ప్రతిష్ఠించుకోండి. 'అంటు' తర్వాత గుంతను తొలగించండి.

*ఎర్నేని గణపతిశాస్త్రి — నెల్లూరు*

* *యంత్ర ప్రతిష్ఠ చేసినా ఏ ఫలితమూ కనిపించడం లేదు.*

అభిషిక్తత, సంప్రోక్షణం, బలి, శాంతి, పూజ జరగని యంత్రాలు అంగట్లోనివి. వాటి వల్ల ఫలితం ఉండకపోగా చెడు జరుగుతుంది.

*సయ్యద్ చాంద్‌బీబీ — నెల్లూరు*

* *తూర్పు - దక్షిణ వీధి అపార్టుమెంటులో తూర్పు ఇల్లు. నా ఆరోగ్యం బాగుండటం లేదు.*

ఆగ్నేయ బ్లాకు ఎక్కువగా స్త్రీలపై ప్రభావం చూపిస్తుంది. అందువల్ల ప్లాటులోని వాస్తుదోషాల్ని సరిచేసుకొని మీరు నీలం(విలోమ) ధరించండి.

*బి.విష్ణుబాబు — సూళ్లూరుపేట*

* *జ్యేష్ఠ, బాద్రపద, ఆషాఢాలలో గృహశంఖు స్థాపనలు చేయకూడదా?*

మృత్యువు, రోగం, సిరినాశనం అని పై మాసాలలో శంఖుస్థాపనలు చేయడాన్ని మహర్షులు నిషేధించారు.

*వి.శైలజ — కొత్తకోట*

* *'యంత్రం' ప్రతిష్టించాక అనూహ్యంగా అన్నీ మేళ్లే జరిగాయి.*

యంత్ర బీజాక్షరాలేగాక, మీ భక్తి శ్రద్ధలు సమస్యల్ని పరిష్కరించాయి. శ్రద్ధ, విశ్వాసం వల్ల మీ శ్రీవారు కోలుకున్నారు. చాలా సంతోషం.

*కె.ఎన్.ఆచార్యులు — తిరుమల*

* *తిరుమల 'వాస్తు' ప్లాను మీరు అంగీకరిస్తారా?*

ఆగమ శాస్త్రయుక్తంగా అనంగీకార బంగారు బావి, నూరు కాళ్ల మండప నిర్మాణం తొలగింపు లాంటి అంశాల్ని నేనూ అంగీకరించను. అయితే స్వతస్సిద్ధమైన వాస్తు అనుకూల ఎత్తుపల్లాలు స్వామి వారికి ఆకర్షణను కూర్చాయి.

*బి.ఆనందరెడ్డి — నాయుడుపేట*

* *'వ్యాధి' నివారణలో గృహవాస్తు పాత్ర ఎంత?*

గృహవాస్తు దోషాల్ని సరిచేసుకున్న తర్వాత వ్యాధి, సమస్యలు నిమ్మళించడానికి కారణం అవాస్తు దోషాల్ని చక్కదిద్దుకోవడమే. సంబంధిత యంత్ర ప్రతిష్ఠ అవసరమే!

*జి.అజిత — సికింద్రాబాద్*

* *దక్షిణ గృహానికి ఆగ్నేయం సెప్టిక్‌ట్యాంకు కరెక్టేనా?*

ఏ మూలలోనూ సెప్టిక్ ట్యాంకు రాకూడదు. అలా రావడం అన్నివిధాలా నష్టం, తూర్పు, ఉత్తరాల్లో ఉచ్ఛస్థానాల్లో మాత్రమే రావాలి.

*పి.వి.కె — చిత్తూరు*

* *కుటుంబం బాగా నచ్చింది. అమ్మాయిది అశ్వనీ నక్షత్రం అయితే చామనఛాయ అబ్బాయికి చేసుకోవచ్చా?*

ఆక్షేపణ లేదు. చేసుకోవచ్చు. కృష్ణుడు, ద్రౌపది, వెంకటేశ్వరుడూ, ద్వైపాయన, వ్యాసుడూ నల్లనివారే. నల్లనివారే ఆరోగ్యంగా ఉంటారని ఈ మధ్య భారతీయ శాస్త్రీయ శాస్త్రజ్ఞుల ఢిల్లీ సదస్సులో విడుదల చేసిన ప్రకటన మీరు వినలేదా?

*సి.రాధాకుమారి — చెన్నై*

* *పిల్లలు ఎందుకు చెప్పిన మాట వినరు?*

వాస్తు దోషాలు, జ్యోతిష వ్యతిరేక గ్రహాలు ఉన్నప్పుడింతే. సిద్ధాంతిని కలిస్తే పరిష్కారమార్గాలు చెబుతారు.

*డి.అరుణానాయుడు — సైదాపురం*

* *యంత్రం పెట్టాక సమస్యలు ఎక్కువయ్యాయి. ఏం చేయాలి?*

అది అంగట్లో యంత్రమై ఉంటుంది. దాన్ని దేవాలయంలో వదిలి వేయండి. శుద్ధి, బలి, అర్చన, సంప్రోక్షణ యంత్రాలకై సంప్రదించండి.

● జగన్ అనుకూల...

# ఆనం వ్యతిరేక గాలులతో కాంగ్రెస్ నిర్వీర్యం!

నెల్లూరు లోక్‌సభ ఎన్నికలలో అఖండ మెజార్టీతో గెలవడం ద్వారా వైఎస్ఆర్ కాంగ్రెస్ అభ్యర్థి మేకపాటి రాజమోహన్‌రెడ్డి కొత్త చరిత్ర సృష్టించాడు. ఓట్ల సంఖ్య రీత్యా చూస్తే అయనకొచ్చిన 2,91,745 మెజార్టీ ఒక రికార్డు క్రింద లెక్క. గతంలో జరిగిన ఏ ఎన్నికలోనూ ఏ అభ్యర్థి కూడా నెల్లూరు లోక్‌సభ స్థానంలో ఇంత భారీ మెజార్టీ సాధించలేదు. అయితే మొత్తం పోలైన ఓట్ల శాతంతో పోలిస్తే మాత్రం రికార్డు మెజార్టీ 1980లో దొడ్డవరపు కామాక్షయ్యదే. ఆయనకా ఎన్నికలో 71 శాతం పైగా ఓట్లు లభించాయి.

మేకపాటి గెలుపు, ఉపఎన్నికల ప్రకటన వెలువడిన రోజే అందరికీ తెలుసు. రాష్ట్రమంతా జగన్ గాలి వీస్తున్నప్పుడు ఆయన కాక మరొకరు గెలుస్తారని ఎవరు వూహిస్తారు? అయితే కాంగ్రెస్ అభ్యర్థిగా తిక్కవరపు సుబ్బరామిరెడ్డి గారు రంగ ప్రవేశం చేయడంతో కొంత అలజడి రేగింది. ఒక దశలో మేకపాటికి కూడా వెన్నులో చలి పుట్టింది. కుక్క చింపిన విస్తరి వలె వున్న జిల్లా కాంగ్రెస్ పార్టీని ఆయన ఒక దారికి తెస్తాడని, కాంగ్రెస్‌వాదులందరూ ఐక్యంగా పనిచేస్తే ఫలితం తప్పక లభిస్తుందని ఆశించడం వల్ల ఏర్పడిన భయం అది. అయితే దురదృష్టవశాత్తు ఆ భయాన్ని నిజం చేయడంలో సుబ్బరామిరెడ్డి గారు సఫలీకృతులు కాలేకపోయారు. జాతీయ రాజకీయాలలో ఒకస్థాయి, అంతస్తు, గుర్తింపు తెచ్చుకొన్న ఆయన స్థానిక రాజకీయాలకొచ్చేసరికి అంత అమాయకత్వంగా వ్యవహరిస్తారని ఎవరూ వూహించలేదు. సుబ్బరామిరెడ్డి గారి ఎన్నికల నిర్వహణ శైలి పసి పిల్లవాడిని తలపింపచేసింది. ఎవరు స్నేహితులో ఎవరు శత్రువులో, ఎవరి సాహచర్యం తనకు మేలు చేస్తుందో, ఎవరితో సాన్నిహిత్యం తనకు ముప్పుతెస్తుందో, ఎవరిని నమ్మాలో, ఎవరిని నమ్మినట్లు నటించాలో తెలుసుకోలేని అమాయకత్వంతో తీవ్రమైన ఆశాభంగం ఎదుర్కొన్నాడాయన.

## మెజార్టీలో రికార్డు సృష్టించిన అనిల్

జగన్ పార్టీకి మెజార్టీ తెప్పించడంలో రాష్ట్ర స్థాయి రికార్డు సృష్టించాడు నెల్లూరు నగర ఎన్నికల నిర్వాహకుడు అనిల్‌కుమార్ యాదవ్. ఈ నియోజకవర్గంలో పోలైన మొత్తం ఓట్లలో (97752) మేకపాటి రాజమోహన్‌రెడ్డికి 63.9 శాతం లభించాయి. మెజార్టీ 43102. మొత్తం ఓట్లలో 44 శాతం మెజార్టీ దక్కడం గొప్పగా చెప్పుకోదగిన రికార్డు. జగన్ పార్టీకి ఇంత శాతం ఓట్లు సాధించిన నియోజకవర్గం రాష్ట్రంలో మరొకటిలేదు.

### సాక్షి సృష్టించిన మాస్ హిస్టీరియా

సిబిఐ అధికారులు జగన్‌ను అరెస్టు చేయడం ప్రజలలో సానుభూతి పవనాలు సృష్టించింది. వైఎస్.విజయమ్మ కన్నీరు దాన్ని ఝంఝూమారుతం వలె పెంచింది. జగన్ అవినీతి పరుడని తెలిసినా, ఆయన జైలుకు పోయింది ప్రజాధనం దోచుకొన్న నేరం మీదనే తప్ప, రాజకీయ వేధింపుతో కాదని తెలిసినా ప్రజలు మాత్రం ఎన్నికల సమయంలో అరెస్టు చేయడాన్ని సహించలేక పోయారు. ఎప్పుడో పెట్టిన కేసులకు ఇప్పుడు అరెస్టు ఎందు కన్న ప్రశ్న సాధారణ వ్యక్తులలో కూడా వ్యక్తమైంది.

మూడు నెలల క్రితం జరిగిన కోవూరు ఉప ఎన్నికలలో రెడ్డి, మాల, ముస్లిం, క్రిస్టియన్ వంటి కొన్ని వర్గాలలో మాత్రమే జగన్ సానుకూలత కన్పించింది. కానీ ఈ ఎన్నికకు వచ్చేసరికి ఆ ఎల్లలు చెరిగి పోయాయి. చంద్రబాబును నెత్తిన పెట్టుకొని కొలుస్తారనుకొనే కమ్మ కులంలో కూడా జగన్ సానుభూతి ఒక ప్రభంజనం వలె వ్యాపించింది. సాక్షి పత్రిక, సాక్షి టీవీ ప్రసారాలు రాష్ట్రం మొత్తం మీద ప్రజలలో మాస్ హిస్టీరియా వంటి ఉన్మాదాన్ని సృష్టించాయి.

### జగన్ గాలికంటే మిన్నగా వీచిన ఆనం తుపాను

అయితే ఇంత ఎదురు గాలిలో కూడా కాంగ్రెస్ పార్టీ గౌరవప్రదమైన సంఖ్యలో ఓట్లను సంపాదించుకొనే అవకాశం వుండింది. పొరుగునే వున్న తిరుపతిలో కాంగ్రెస్ నేతలు జగన్ గాలికి గట్టి స్పీడ్ బ్రేకర్ వేయగలిగారన్న విషయం ఇక్కడ గమనార్హం. అయితే నెల్లూరు జిల్లాకొచ్చేసరికి జగన్ గాలి కంటే మిన్నగా ఆనం సోదరుల పట్ల ప్రజలలో వున్న వ్యతిరేకత తీవ్రమైన తుపానుగా పరిణమించింది. దాన్ని వ్యతిరేకత అనడం కంటే వారంటే అసహ్యం, ద్వేషం అనడం సమంజసం. నేదురుమల్లి జనార్ధనరెడ్డి రాజకీయ నిష్క్రమణతో తమకు లభించిన మహదవకాశాన్ని జిల్లా నేతలుగా ఎదగడానికి సద్వినియోగం చేసుకొనే బదలు, జిల్లా ప్రజల ఛీత్కారాలు సంపాదించుకొన్నారు అన్నదమ్ములిద్దరూ. అధికార మదం, ధన దాహం, అహంకార తత్వాలతో వారి పేరు చెప్తే రోత కలిగే పరిస్థితి కొనితెచ్చుకొన్నారు. దానికి శిక్ష సుబ్బరామిరెడ్డి అనుభవించవలసి వచ్చింది. రాజమోహన్ రెడ్డికి వచ్చిన మూడు లక్షల మెజార్టీలో ఒకటిన్నర లక్ష జగన్ సానుభూతిదైతే, మరొక ఒకటిన్నర లక్ష ఆనం సోదరుల బహుమానం.

### బందిపోట్లు నయం

కనీసం ఎన్నిక వరకైనా చిత్తశుద్ధితో చేసి వుంటే కొంతలో కొంత నయంగా వుండేది. కానీ అన్నదమ్ములిద్దరూ బందిపోట్ల కంటే హీనంగా వ్యవహరించారు. సుబ్బరామిరెడ్డి గారు ఎన్నికల ఖర్చు కోసం తెచ్చుకొన్న సొమ్ములో ముప్పాతిక భాగం వీరిద్దరి ధనదాహానికి హారతి కర్పూరమైపోయింది. ఎన్నికల నిర్వహణ మొత్తం తమ కను సన్నలలో నడవాలని ఆంక్ష పెట్టారు వీరిద్దరూ. తమకు తెలియకుండా ఎవరితో మాట్లాడకూడదని నియమం

కొరవ 14వ పేజీలో

## అన్నదమ్ములిద్దరూ అద్దాలు పీకేయించారు!

ఎన్నికల ఫలితాలు వెలువడగానే ఆనం సోదరులు చేసిన మొదటి పని – తమ పడక గదులలోని అద్దాలను పీకేయించడం. అర్జెంటుగా కార్పెంటర్‌ను పిలిపించి ఇంట్లో ఎక్కడా అద్దం అనేది కనపడకుండా చేయమన్నారట. అందుకు కారణం – అద్దంలో తమ ముఖం తాము చూసుకొన్నా అసహ్యంగా, వికృతంగా కన్పించడం. నెల్లూరు, ఆత్మకూరులలో జనం ఓట్ల రూపంలో పేడనీళ్లు చల్లడంతో ఎవరికీ ముఖం చూపించలేక పడక గదికి పరిమితమైపోయారు. అక్కడా తమ ముఖం తాము కూడా చూసుకోలేక అద్దాలు పీకేయించారట.

## ఉదయగిరి బరిలో దిగిన వారికి వచ్చిన ఓట్లు!

| | |
|---|---|
| మొత్తం ఓట్లు : | 1,93,870 |
| పోలైనవి : | 1,60,410 |
| పోస్టల్ బ్యాలెట్లు : | 250 |



| | |
|---|---|
| **మేకపాటి శేఖర్‌రెడ్డి (వైకాపా)** | **75,103** |
| బొల్లినేని వెంకట రామారావు (టిడిపి) | 44,505 |
| కంభం విజయరామిరెడ్డి (కాంగ్రెస్) | 34,489 |
| కాకు వెంకయ్య (సిపిఎం) | 1433 |
| కడప వెంకట రామరాజు (రాజ్యాధికారపార్టీ) | 674 |
| కోడూరి ప్రభాకరరావు (పిరమిడ్ పార్టీ ఆఫ్ ఇండియా) | 968 |
| ఎరపనేని రామ్మూర్తి (ఇండి) | 676 |
| కాకి ప్రసాదరావు (ఇండి) | 179 |
| చింతనబోయిన బయ్యన్న (ఇండి) | 154 |
| దామా మహేశ్వరరావు (ఇండి) | 208 |
| బి.మధుసూధనరావు (ఇండి) | 239 |
| మల్లవరపు కృష్ణారెడ్డి (ఇండి) | 552 |
| రవిప్రసాద్ (ఇండి) | 446 |
| రామిరెడ్డి శ్రీనివాసులురెడ్డి (ఇండి) | 784 |
| **మెజార్టీ** | **30,598** |

## నెల్లూరు లోక్‌సభ బరిలో దిగిన వారికి వచ్చిన ఓట్లు!

| | |
|---|---|
| మొత్తం ఓట్లు : | 13,17,451 |
| పోలైనవి : | 9,80,970 |
| పోస్టల్ బ్యాలెట్లు : | 1693 |



| | |
|---|---|
| **మేకపాటి రాజమోహన్‌రెడ్డి (వైకాపా)** | **5,35,436** |
| తిక్కవరపు సుబ్బరామిరెడ్డి (కాంగ్రెస్) | 2,43,691 |
| వంటేరు వేణుగోపాలరెడ్డి (టిడిపి) | 1,54,103 |
| చంద్ర రాజగోపాల్ (సిపిఎం) | 17,952 |
| నిడిగంటి రాజశేఖర్ (రిపబ్లికన్ పార్టీ ఆఫ్ ఇండియా) | 6,159 |
| షేక్ ముజిబుర్ రహమాన్ (పిరమిడ్ పార్టీ ఆఫ్ ఇండియా) | 5,638 |
| పల్లాల ధనుంజయ (ఇండి) | 1,835 |
| కొంగలేటి జయకుమార్ మిత్ర (ఇండి) | 1,667 |
| జెట్టి వేణు (ఇండి) | 1,497 |
| చింతాల చిరంజీవి (ఇండి) | 1,395 |
| పొత్తూరి తులసీదాస్ గుప్త (ఇండి) | 2,095 |
| మందువ వెంకటరావు (ఇండి) | 2,388 |
| మేడా మల్లారెడ్డి (ఇండి) | 6,876 |
| **మెజార్టీ** | **2,91,745** |

## ఉదయగిరిలో రౌండ్‌వారీగా పోలైన ఓట్ల వివరాలు

| రౌండ్ | వైఎస్ఆర్‌సిపి | టిడిపి | కాంగ్రెస్ | సిపిఎం | మెజార్టీ |
|---|---|---|---|---|---|
| 1 | 2697 | 1941 | 2493 | 70 | 204 |
| 2 | 3969 | 1362 | 2047 | 81 | 1922 |
| 3 | 4982 | 2280 | 1398 | 206 | 2702 |
| 4 | 3437 | 1751 | 2021 | 120 | 1416 |
| 5 | 3250 | 2963 | 1232 | 60 | 287 |
| 6 | 2936 | 1980 | 2189 | 46 | 747 |
| 7 | 3365 | 1296 | 2694 | 40 | 671 |
| 8 | 3609 | 1557 | 2265 | 70 | 1344 |
| 9 | 4953 | 2248 | 1812 | 67 | 2705 |
| 10 | 4749 | 1605 | 1907 | 49 | 2842 |
| 11 | 4318 | 1845 | 1947 | 131 | 2371 |
| 12 | 3486 | 3226 | 1889 | 65 | 260 |
| 13 | 3094 | 4112 | 1145 | 49 | 1018 |
| 14 | 4706 | 2914 | 1937 | 53 | 1792 |
| 15 | 5177 | 4700 | 1237 | 64 | 477 |
| 16 | 4037 | 1966 | 1832 | 43 | 2071 |
| 17 | 5066 | 2841 | 1773 | 104 | 2225 |
| 18 | 5384 | 2598 | 1863 | 92 | 2786 |
| 19 | 1761 | 1236 | 770 | 23 | 525 |
| **మొత్తం** | **75103** | **44505** | **34489** | **1433** | **30598** |

# ఎందుకంటే... ప్రేమంట ఎందుకు చూడాలంటా?

అల్లూరు రహీం

'తొలిప్రేమ' చిత్రాన్ని హృదయానికి హత్తుకుపోయేలా తీసిన దర్శకుడు ఎ.కరుణాకరన్. ఆ తర్వాత ఆయన తీసిన ఉల్లాసంగా... ఉత్సాహంగా, డార్లింగ్ చిత్రాలు ఓ మోస్తరుగా ఆడాయి. స్రవంతి మూవీస్ పతాకంపై తన కుమారుడు రామ్‌ను హీరోగా పెట్టి రవికిషోర్ తీసిన ఎందుకంటే... ప్రేమంట పేరు తప్ప సినిమా పరమచెత్తగా ఉంది. దీనికి కారణం దర్శకుడు రూపొందించిన కథ అనే చెప్పకతప్పదు. హీరో ఈ సినిమాలో మానవరూపంలో ఉన్న హీరోయిన్‌ను ప్రేమించడు. ఆత్మరూపంలో ఉన్న ఆమెను ఆరాధిస్తాడు. ఈ లింకు సరిగ్గా కుదరలేదు. హీరోయిన్ ఆత్మగా మారడం, హీరోకే కనిపించడం, ముందు జతచేసిన 1980లో జరిగిన ప్రేమకథ సైతం విద్దూరంగా ఉంది. తొలిప్రేమ చిత్రంలో హీరోయిన్ కనిపించే సన్నివేశాన్ని తలచుకొంటే ఇప్పటికీ రోమాలు నిక్కబొడుచుకొంటాయి. ఎందుకంటే... ప్రేమంటలో అటువంటి సన్నివేశం ఒక్కటీ లేదు. పారిస్‌లో భారత అంబాసిడర్‌గా పనిచేసే వ్యక్తి కుమార్తె హీరోయిన్. కానీ ఆ అంబాసిడర్ పర్సనల్ సెక్యూరిటీ అధికారి టెర్రరిస్టులను కలిసి సహకారమందిస్తుంటాడు. విదేశాల్లో మన అంబాసిడర్ల గతి విధులపై తీవ్రమైన నిఘా ఉంటుందన్న విషయం లోకానికంతటికీ తెలుసు. కానీ దర్శకునికి తెలిసినట్లు లేదు. ప్రేమ కథా చిత్రాలకు ప్రాణం పాటలు, మాటలు. కానీ ఈ చిత్రంలో ఒక్క పాటా బాగాలేదు. జి.వి.ప్రకాష్‌కుమార్ సంగీతం సమకూర్చిన పాటలు ఇంగ్లీషు పాటల్లా ఉన్నాయి. మిల్క్ బ్యూటీ తమన్నాను మంచి ప్రేమికురాలిగా ఉపయోగించుకోవడం కూడా కరుణాకరన్‌కు చేతకాలేదు. అయితే విదేశీ అందాలను కెమెరామెన్ ఐ ఆండ్రూ చక్కగా చూపాడు. నువ్వు విడిచే చరణంతో సాగే పాటలో ప్రేమ్‌రక్షిత్ కూర్చిన నృత్యరీతులు బాగున్నాయి. మాటల రచయిత కోన వెంకట్ ఈ చిత్రంలో విలన్ షేడ్ ఉన్న పాత్ర పోషించాడు. ఆయన వ్రాసిన మాటల్లో ఓ మోస్తరు అంటే మౌనంతో ఆశలు రేపొద్దు, ఎంత మీడియా అయినా తొక్కేస్తారా? ఈ చిత్రంలో హీరో అతిగా ప్రవర్తిస్తుంటాడు. ఈ సినిమా చూసి యువతరం అలానే నడవడం నేర్చుకొంటే సమాజానికి క్షేమకరం కాదు. ప్రిన్సిపల్ పాత్రలో బ్రహ్మానందాన్ని రంకు రాముడుగా చేయడం, ఆ పాత్రను కామెడీకి వాడాలన్న ప్రయత్నం కూడా బాగాలేదు.




చిత్రకథలోనికి వెళ్తే 1980లో విశాఖపట్టణంలోని పాలిటెక్నిక్ కాలేజికి వెళ్లే శ్రీనిధి(తమన్నా)ను ఒక బస్‌స్టాప్‌లో నిలబడి శ్రీకృష్ణ(రామ్) ఆరాధిస్తుంటాడు. కానీ శ్రీనిధి తన కుటుంబ సమస్యలతో అతనికి ఐలవ్‌యు చెప్పదు. కాలేజి చివరి రోజు ఎలాగైనా శ్రీనిధిని చూడాలని కాలేజి లేడీస్ స్పెషల్ బస్సు ఎక్కే రామ్ యాక్సిడెంట్ జరగడంతో ఆమె చేతుల్లోనే ప్రాణాలు విడుస్తాడు. దీన్ని తట్టుకోలేక శ్రీనిధి సైతం గుండెపగిలి చనిపోతుంది. మళ్లీ కథ 2012కు వస్తుంది. శ్రీనిధి స్రవంతిగా పారిస్‌లో భారత రాయబారి చక్రధర్(సుమన్) కుమార్తెగా పుడుతుంది. హైదరాబాద్‌లోని వ్యాపారవేత్త కృష్ణారావు(షాయాజిషిండే) కుమారునిగా రామ్ (రామ్) పుడతాడు. ఇంట్లో వాళ్లని ముప్పతిప్పలు పెడుతుండడంతో భరించలేని కృష్ణారావు తెలివిగా రామ్‌ను పారిస్ పంపి, అక్కడ అతని పాస్‌పోర్ట్ లాక్కొనేలా చేసి, మిత్రుడు పుల్లారెడ్డి(నాగినీడు) లిక్కర్ ఫ్యాక్టరీలో కూలీగా బతుకీడ్చి బాధ్యతలు తెలుసుకోమంటాడు. అంబాసిడర్ చక్రధర్ దగ్గర సెక్యూరిటీ అధికారిగా పనిచేసే డికెను టెర్రరిస్టులు కలవగా ఈ వ్యవహారాన్ని స్రవంతి చూస్తుంది. ఈ విషయం ఆమె తండ్రికి చెప్పకుండా ఇండియా పంపేస్తాడు ఇంట్లో వంట మనిషి(కాశీ విశ్వనాథ్). ఇక్కడ ఆమెను చంపను రౌడీ కోకా(కోన వెంకట్)ను వినియోగిస్తారు. అతని నుంచి తప్పించుకొనే ప్రయత్నంలో జరిగే యాక్సిడెంట్‌లో స్రవంతి కోమాలోకి వెళ్లి ఆత్మ రూపిణిగా మారుతుంది. పారిస్‌లో పుల్లారెడ్డి ఫ్యాక్టరీ నుంచి తప్పించుకొని వెళ్తున్న రామ్‌కు కనపడుతుంది. అతడికి ఇండియా వెళ్లను సలహా ఇస్తుంది. తన తండ్రి చక్రధర్‌ను కలిసి పాత స్నేహితుని కుమారుడినని అబద్ధం చెప్పించి పాస్‌పోర్టు వచ్చేలా చేస్తుంది. తీరా రామ్ హైదరాబాద్ వచ్చేసి విమానాశ్రయంలో దిగగా వెనుక నిల్చొని తాను ఆత్మనంటుంది స్రవంతి. కోమాలో ఉండి తాను చికిత్స పొందుతున్న గాంధీ ఆసుపత్రికి అతణ్ణి తీసుక వెళ్తుంది. ఆమె రామ్ ఒక్కడికే కనపడుతుంది... మాట్లాడుతుంది. స్రవంతి ఇండియా రావడానికి కారకుడైన సెక్యూరిటీ ఆఫీసర్ డికె కూడా ఆమెను చంపను ఇక్కడికి వస్తాడు. అంతిమంగా హీరో ఆత్మస్వరూపిణి అయిన హీరోయిన్‌ను ఎలా రక్షించాడన్నది తెరపై చూసిన వాళ్ల తలలు పగిలి తలనొప్పి రావడంతో చిత్రం ముగుస్తుంది.

## హన్సిక టాప్ హీరోయినట!



దేశముదురు ఫేం హన్సిక తాను తెలుగు పరిశ్రమలో టాప్ హీరోయిన్నంటుంది. ప్రస్తుతం ఒక సినిమాలో నటించినందుకు కోటి రూపాయలు తీసుకొంటున్న ఈ భామ తాను టాప్ హీరోయిన్ ఎందుకు కాదంటుంది. ఇటీవల విలువైన కొత్త కారులో తిరుగుతున్న హన్సిక వార్తల్లో వ్యక్తయ్యింది. ఈ కారును ఓ తమిళ యువ హీరో ఆమెకు కొనిచ్చాడట. ఈ విషయమై వివాదం రేగడంతో తానే ఈ కారు కొనుక్కొన్నట్లు హన్సిక వివరణ ఇచ్చింది. చేతినిండా సినిమాలున్నప్పుడు ఇటువంటి కార్లు కొనడం ఓ లెక్కా అంటూ బడాయికి పోయింది ఈ అందగత్తె.



## నాకు డ్యాన్స్ రాదు

హీరోయిన్‌గా ఛాన్సులుంటే చెప్పండి... ఆలోచిస్తా. ఐటమ్ పాటల గూర్చి అడగొద్దు అంటోంది ఫోర్న్ స్టార్ సన్నీలియోన్. జిస్మ్ – 2 చిత్రంలో హీరోయిన్‌గా నటించిన ఈ ఇండో అమెరికన్ ఫోర్న్‌స్టార్ తాను డ్యాన్సులు గొప్పగా చేయలేనని అందుకే వీటికి దూరంగా ఉండాలనుకొన్నట్లు చెప్పింది. బాలీవుడ్ సినిమాల్లో నటించాలన్న ఆసక్తే తనను ఫోర్న్ సినిమాలకు దూరం చేసిందంది. అయితే ఆ సినిమాలను పూర్తిగా వదిలేసుకొన్నట్లు కాదంది. భారతదేశంలో ఫోర్న్ చిత్రాలు తప్పని పాశ్చాత్య దేశాల్లో అది ఒక కళేనంటుంది సన్నీలియోన్.

## అంజలికి ఒక అవకాశం



సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు ట్రయిలర్స్ బయటకు వచ్చినప్పటి నుంచి ఈ సినిమాకు అంచనాలు పెరిగాయి. తెలుగు లోగిళ్లలో బంధాలు, అనుబంధాల నేపథ్యంలో తయారవుతున్న సినిమాగా దీనికి గుర్తింపు వచ్చింది. వెంకటేష్, మహేష్‌బాబులు కనపడ్డ ఫ్రేమ్ కూడా బాగుంది. ఈ సినిమాలో అందరినీ ఆకర్షిస్తున్న హీరోయిన్ అంజలి. తమిళ చిత్రాల్లో క్లిక్ అయిన అచ్చ తెనుగు అమ్మాయే అంజలి. సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు చిత్రం తనకు తెలుగులో బ్రేక్ ఇస్తుందని, సౌందర్యలా పేరు తెచ్చుకోగలనన్న ఆత్మ విశ్వాసాన్ని అంజలి వ్యక్తం చేస్తుంది.



## గబ్బర్‌సింగ్ – 2

హీరో పవన్‌కళ్యాణ్ అభిమానులంతా గబ్బర్‌సింగ్ విజయోత్సాహంలో ఉన్నారు. వీరందరికీ మరో శుభవార్త. ఈ సినిమాకు రెండో భాగం కూడా వస్తుంది. తెలుగులో గబ్బర్‌సింగ్‌ను చూసిన హిందీ నిర్మాతకు అంత్యాక్షరి సన్నివేశాలు బాగా నచ్చాయట. ఇవి తాను దబాంగ్ – 2లో వాడుకొంటాననేసరికి నిర్మాత బండ్ల గణేష్ ఓకేఅన్నాడట. దబాంగ్ – 2 రీమేక్ హక్కుల్ని కూడా పరమేశ్వర ఆర్ట్సుకే ఇస్తామని వాళ్లు మాటిచ్చారట. గబ్బర్‌సింగ్ – 2ను పవన్‌కళ్యాణ్‌తోనే తీస్తాను. అయితే ఎప్పుడో చెప్పలేనన్నాడు బండ్ల గణేష్.

## నిత్యానందపై రంజిత చిత్రం



మావిచిగురు చిత్రంతో తెలుగు ప్రేక్షకులకు పరిచయమైన నటి రంజిత. ఆ తర్వాత తమిళ పరిశ్రమవైపు వెళ్లిన ఆమె నిత్యానంద స్వామి శిష్య బృందంలో చేరి వార్తల్లోని వ్యక్తయ్యింది. స్వామితో కలిసి హాట్ హాట్ వీడియోల్లో కనిపించిన ఆమె నిత్యానందస్వామి గొప్పదనాన్ని, మహత్తును తెలియజేస్తూ ఓ చిత్రాన్ని తీస్తున్నానంది. ఇన్నాళ్లు మా స్వామి గూర్చి దుష్ప్రచారమే జరిగింది. ఈ సినిమా మాత్రం ఆయన జీవితాన్ని తెలిపేలా ఉంటుందంటుంది.

# శవ రాజకీయం చేసింది కెవిపినే!

**● నెల్లూరులో కుండబద్ధలు కొట్టిన వైఎస్ తనయ.**

వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థుల తరపున ఉప ఎన్నికల్లో రాష్ట్రవ్యాప్తంగా ప్రచారం చేసిన వైఎస్ విజయమ్మ, షర్మిళమ్మల వల్ల ఆ పార్టీకి బోలెడంత సానుభూతి లభించిందనడం వాస్తవం. అన్ని రోడ్ షోలలో వీరి ఉపన్యాసం ఒక ధోరణిలో సాగితే నెల్లూరులో మాత్రం షర్మిళ కాస్త దూకుడు పెంచారు. ఆమె మాటకు ఉవ్వెత్తున యువకులు స్పందిస్తుండడంతో ధోరణి మార్చారు. జగనన్న తండ్రి శవం ప్రక్కన పెట్టుకొనే ముఖ్యమంత్రికాను ఎమ్మెల్యేల నుంచి సంతకాలు సేకరించాడని పలువురు పలు పలు విధాలుగా మాట్లాడుతున్నారు. అసలా సమయంలో మా గుండెలు పగిలిపోయి వున్నాయి. ఎవరు ఏమి చేస్తున్నారో తెలియని పరిస్థితిలో వున్నాము. అసలు ఎందుకు బతికి వున్నామన్న మానసిక స్థితిలో వుండినాము. ఈ సమయంలో వీరప్ప మొయిలీ సమక్షంలో సంతకాలు సేకరణ ఆ పెద్ద మనిషి (కెవిపి) చేశారు. శవ రాజకీయం వాళ్లు చేశారు. జగనన్న ఆ పని చేయలేదు. దీనికి నేను సాక్షినంటూ బాంబులాంటి మాట షర్మిళ పేల్చారు. కాని ఆమె ఉపన్యాస ఝరిలో దీన్ని చాలామంది క్యాచ్ చేయలేకపోయారు. దేవుడు మంచివాళ్ల పక్షాన నిలబడతాడు. జగనన్నను నిర్దోషిగా జైలు నుండి బయటకు తీసుకొస్తాడని షర్మిళ ఆత్మ విశ్వాసం వ్యక్తం చేశారు.

# మళ్లీ స్కూళ్ల గుర్తింపుపై వివాదం

**గుర్తింపులేని వాటిపై చర్యకు డిమాండ్**

జిల్లాలోని వివిధ ప్రైవేట్ పాఠశాలలకు ప్రభుత్వ గుర్తింపు లేదు. జిల్లా విద్యాశాఖ దీనిపై గత ఏడాది ఈ పాఠశాలల వివరాలను ప్రకటించింది. ప్రభుత్వ నియమనిబంధనలకు అనుగుణంగా లేని పాఠశాలలను గుర్తింపునివ్వదు. అయితే చాలా పాఠశాలలు ఇవేమీ పట్టించుకోకుండా ఆర్భాటపు ప్రకటనలతో తల్లిదండ్రులను, విద్యార్థులను ఆకర్షించి పాఠశాలలు నిర్వహిస్తున్నాయి. విద్యాశాఖ వీటిపై చర్యలు తీసుకోకుండా మీనమేషాలు లెక్కిస్తుండడంపై విమర్శలు చెలరేగుతున్నాయి. గత ఏడాది నుంచి ఈ వివాదం నడుస్తున్నా నిర్దిష్టమైన చర్యలు తీసుకున్న దాఖలాలు లేవు. గుర్తింపు పొందివున్న వివిధ పాఠశాలల యాజమాన్యాలు ఈ విద్యాసంవత్సరం ప్రారంభం అవుతుండడంతో ఈ వివాదాన్ని తెరపైకి తీసుకొస్తున్నాయి. గుర్తింపులేని పాఠశాలలను గుర్తించినప్పటికీ ఎందుకు చర్యలు చేపట్టడం లేదని ప్రశ్నిస్తున్నారు. ఇంటర్నెట్‌లో గుర్తింపులేని పాఠశాలల వివరాలు పొందుపరచి చేతులు దులుపుకున్నారు తప్ప ఎందుకు ఆ పాఠశాలలను మూయించలేకపోతున్నారని అసోసియేషన్ నాయకులు అడుగుతున్నారు. వేసవి సెలవుల అనంతరం తిరిగి పాఠశాలలు పున:ప్రారంభిస్తున్న సమయంలో విద్యార్థుల భవిష్యత్తును దృష్టిలో వుంచుకొని గుర్తింపు లేని పాఠశాలు పని చేయకుండా చూడాల్సిన విద్యాశాఖ ఆ సంగతిని మరచి ఆర్భాటపు ప్రకటనలు చేయడం విమర్శలకు దారి తీస్తుంది.

# నారాయణ విద్యార్థుల ప్రతిభ



విజేతలతో నారాయణ విద్యాసంస్థల అధినేత డాక్టర్ పొంగూరు నారాయణ.

ప్రతిష్టాత్మకమైన ఏఐఈఈ ఫలితాల్లో నారాయణ కళాశాల విద్యార్థులు అద్వితీయమైన ప్రతిభ పాటవాలను ప్రదర్శించినట్లు నారాయణ విద్యాసంస్థల ఛైర్మన్ డాక్టర్ నారాయణ తెలిపారు. విజయవాడలోని నారాయణ ఐఐటి అకాడమి విద్యార్థి వెనంపూడి చైతన్య జాతీయస్థాయిలో మొదటి ర్యాంకు సాధించినట్లు చెప్పారు. బిటెక్ ఎస్సీ కేటగిరిలో వై.కిరణ్ ప్రథమస్థానంలో నిలిచాడన్నారు. ఓపెన్ విభాగంలో అనంత్‌గుప్తా జాతీయస్థాయిలో రెండో ర్యాంకు సాధించినట్లు తెలిపారు. బిఆర్క్ ఓపెన్ కేటగిరిలో శశిభూషణ్ భరద్వాజ్ ద్వితీయ ర్యాంకు సాధించాడన్నారు. ప్రతి ఏడాదిలాగే ఈ ఏడాది తమ విద్యార్థులు ఏఐఈఈఈలో విజయపరంపరను కొనసాగించినట్లు ఆయన తెలిపారు. మొత్తం మీద ఓపెన్ కేటగిరిలో 40ర్యాంకులు, అన్ని విభాగాల్లో మొదటి 22 ర్యాంకులు సాధించారన్నారు. ఇవేకాక మరో 178 ర్యాంకులు పొందారన్నారు. ర్యాంకులు సాధించిన విద్యార్థినీ విద్యార్థులను ఛైర్మన్ నారాయణ, వైఎస్ ఛైర్మన్ రామకృష్ణ, జోనల్ ఇన్‌చార్జీలు ఇబ్రహీం, బ్రహ్మశ్రీలు అభినందించారు.

నెల్లూరులోను ఏఐఈఈఈ ఫలితాల్లో నారాయణ విద్యార్థులు వెయ్యిలోపు 24 ర్యాంకులు, 5వేల లోపు 103 ర్యాంకులు సాధించినట్లు విద్యాసంస్థల జోనల్ మేనేజర్ విజయభాస్కర్‌రెడ్డి తెలిపారు.

● ఎస్ఆర్‌కె

# నెక్ట్స్ జనరేషన్ స్కూల్ ప్రారంభం


నెల్లూరు మాగుంట లేఅవుట్‌లో ఎస్ఆర్‌కె నెక్ట్స్ జనరేషన్ స్కూల్‌ను ప్రారంభిస్తున్న ఆర్థికమంత్రి రామనారాయణరెడ్డి. ప్రక్కన స్కూల్ అధినేత కృష్ణమూర్తి.

నెల్లూరు నగరంలో విద్యాబోధనలో పేరుగాంచిన డాక్టర్ ఎస్ఆర్‌కె స్కూలు ఆధ్వర్యంలో అన్ని హంగులు, వసతులతో అంతర్జాతీయ ప్రమాణాలతో నెక్ట్స్ జనరేషన్ స్కూలును ఏర్పాటు చేశారు. దీన్ని గురించి స్కూలు కరస్పాండెంట్, గురుబ్రహ్మ అవార్డు గ్రహీత వి.కృష్ణమూర్తి విలేకరుల సమావేశంలో వివరించారు. సాధారణ పాఠశాలల్లో జరిగే విద్యాబోధన కంటే మిన్నగా సెంట్రలైజ్డ్ ఎయిర్ కండిషన్ సౌకర్యంతో ఈ స్కూలును ఏర్పాటు చేశామన్నారు. అంతర్జాతీయ ప్రమాణాలతో కూడిన స్కూళ్లలో తమ పిల్లలను చేర్పించేందుకు తల్లితండ్రులు మొగ్గు చూపుతున్నారన్నారు. అందుకోసం మద్రాస్, బెంగుళూరు, హైదరాబాద్‌లో పిల్లల్ని చేర్పిస్తున్నారని తెలిపారు. దీని వలన పిల్లలు పసి వయసులో తల్లిదండ్రులతో కలసి వుండే అవకాశం లేకుండా పోతోందని, దీనిని దృష్టిలో వుంచుకొని ఎస్ఆర్‌కె నెక్ట్స్ జనరేషన్ ఎయిర్ కండిషన్డ్ స్కూలును ఏర్పాటు చేసినట్లు తెలిపారు. ఈ స్కూలులో సాంప్రదాయ పద్ధతులను అధిగమించి మల్టిపుల్ ఇంటలిజెన్స్‌ను దృష్టిలో వుంచుకొని తరగతి గదులను కళాత్మకంగాను, సాంకేతికంగాను నిర్మించామన్నారు. బయోలజీ, కంప్యూటర్ ల్యాబ్‌లు, ఈ–లైబ్రరీ ఏర్పాటు చేశామన్నారు. సీఫెల్ రిటైర్డ్ డైరెక్టర్ డాక్టర్ ప్రకాశం, శ్రీచైతన్య ఐఐటి అకడమిక్ డైరెక్టర్ ఖుద్దూస్ అలీబేగ్, న్యూరో లింగ్విస్టిక్ ప్రోగ్రామింగ్ నిష్ణాతుడు గమనం, తదితర అనుభవజ్ఞులైన టీచర్లతో ఈ స్కూలును నడపనున్నట్లు తెలిపారు.

## సణుగుడు

8వ పేజీ కొరవ

బాపన పూజారి మీద దయతలచి ఈ గుడికి అవకాశమిచ్చాడు. కానీ ఆయన వారసులు ఆ పూజారులను తరిమేసి, హారతి పళ్లెం చిల్లర మొత్తం జేబులో వేసుకొంటున్నారట. అబ్బ పుణ్యాన బావి తవ్విస్తే కొడుకు పుణ్యాన పూడ దోశాడన్న సామెత ఇటువంటి వారిని చూసే పుట్టివుంటుంది. బెజవాడ గోపాలరెడ్డి, తిక్కవరపు రామిరెడ్డి వంటి పెద్దలు టౌన్‌హాల్ బాగోగులు చూసినన్ని ఏళ్లు, చిల్లిగవ్వ లెక్కల్లో తేడా వచ్చేది కాదు. కానీ ఇప్పుడు టౌన్ హాల్ బాడుగలలో సగం లెక్కల్లో కన్పించడం లేదట. పై పెచ్చు పాతకాలం పెద్దలు పొదుపు చేసి, మిగిల్చిపోయిన సొత్తులో 15 లక్షల రూపాయల వరకు భవన మరమ్మత్తుల పేరిట స్వాహా చేశారని విన్పడుతున్నది. కమిటీలో విభేదాలు, వర్ధమాన సమాజంతో పేచీలతో కోర్టులకెక్కి టౌన్‌హాల్ ప్రతిష్టను భ్రష్టుపట్టిస్తున్నారు.

టౌన్‌హాల్ పునర్నిర్మాణంలో జెఎస్.రెడ్డి చూపిన దాతృత్వం ప్రశంసనీయమైనది. దానికి విలువ, సార్ధకత నిలవాలంటే నిర్వహణపై కూడా ఆయన కొంత శ్రద్ధ చూపడం అవసరం. ఆషాఢభూతుల వంటి వారసుల కక్కుర్తికి అది బలైపోకుండా చూడమని మనవి.

***

నెల్లూరు వంటి జనారణ్యంలో సామాన్యుడికి మిగిలిన ఏకైక కాలక్షేపం సినిమా మాత్రమే. కానీ రాను రాను అది ఖరీదైన విలాసంగా మారి పోతున్నది. నలుగురు సభ్యులున్న కుటుంబం హాలుకు వెళ్లి ఒక సినిమా చూడాలంటే వెయ్యి రూపాయలు ఖర్చయిపోతున్నాయి. హాళ్ల ఆధునీకరణ పేరుతో టిక్కెట్ల రేట్లు పెంచేశారు. లోపల పిల్లలు తినే సాధారణ తినుబండారాలకు ఫైవ్ స్టార్ హోటల్ రేట్లు పెడుతున్నారు. దానితో మధ్యతరగతి కుటుంబీకులు సినిమా అంటే వెనుకా ముందు ఆలోచించవలసి వస్తున్నది. పైరసీ వల్ల సినిమా పరిశ్రమ సర్వనాశనమై పోతున్నదని నిర్మాతలు గగ్గోలు పెడుతున్నారు. కానీ ప్రేక్షకులు హాలుకు రాకుండా ఇంట్లో సిడిల ద్వారా సినిమా చూసేందుకు మోజు పడడానికి అసలు కారణం ఈ ఖరీదు వ్యవహారమే అన్న నిజం వారు గ్రహించడం లేదు. సినిమా హాళ్లలో వినోదం సామాన్యుడికి అందుబాటులో వుంటే, నూటికి తొంభై మంది హాళ్లకు రావడానికే ఇష్టపడతారు తప్ప చెక్క పెట్టెల వంటి టీవీలతో సంతృప్తి చెందరు.

దీనికి తోడు కొత్త సినిమా విడుదలైతే చాలు బ్లాక్ మార్కెటింగ్ విచ్చలవిడిగా నడుస్తున్నది. పెద్ద పెద్ద హీరోల సినిమాల విషయంలో ఈ నల్ల వ్యాపారం చెప్పనలవి కాని స్థాయిలో నడుస్తున్నది. కోట్లు ఖర్చు పెట్టి అత్యాధునిక సినిమా హాళ్లు నడిపే వారు బ్లాక్ టిక్కెట్లకు కక్కుర్తి పడతారని భావించలేము. కానీ, ఆ హాళ్లలో ఆ చీకటి వ్యాపారం జోరుగా నడుస్తున్న మాట నూటికి నూరుపాళ్లు నిజం. ఇటీవల విడుదలైన పవన్ కళ్యాణ్ సినిమా తొలిరోజు టిక్కెట్ వెయ్యి రూపాయలకు అమ్ముడైందట. బాలకృష్ణ, జూనియర్ ఎన్టీఆర్, రామచరణ్ తేజ, అల్లు అర్జున్, పవన్ కళ్యాణ్, నాగార్జున వంటి హీరోల సినిమాలన్నిటితో ఇదే సమస్య. అభిమాన సంఘాల వాళ్లు మొదటి రోజు టిక్కెట్లన్నీ తమకే ఇచ్చేదాకా ఆగం చేసి పారేస్తారు. చిరంజీవి రాజకీయాలలోకి వచ్చిన తర్వాత ఎమ్మెల్యే స్థాయి నేతలు సైతం టిక్కెట్ల బేరం పెడుతున్నారు. ఇట్లా తీసుకొన్న టిక్కెట్లను అభిమానులు పంచుకొంటే ఒక రకం. కానీ వీరు వాటిని బ్లాక్‌లో అమ్మి సొమ్ము చేసుకొంటున్నారు. కానీ నింద మాత్రం హాల్ యాజమాన్యాల మీద పడుతున్నది. అమెరికన్ స్థాయి సినిమా హాళ్లు నెల్లూరులో కట్టిన ఎస్2 యాజమాన్యం కూడా ఇదే సమస్య ఎదుర్కొంటున్నది. మొదటిరోజు హాలుకు వెళ్లిన ప్రేక్షకులు కౌంటర్‌లో టిక్కెట్లు దొరకక పోవడంతో హాళ్ల యాజమాన్యాన్ని శాపనార్ధాలు పెడుతున్నారు. బ్లాక్‌లో అమ్ముకొంటున్నారని నింద వేస్తున్నారు. కానీ నిజం ఎంత మందికి తెలుస్తుంది? ఈ మధ్య ఒక ఔత్సాహిక ప్రేక్షకుడు ఇంటర్నెట్‌లో ఎస్2 యాజమాన్యం మీద చీటింగ్ కేసు పెట్టాలన్నంత కసితో వ్యాసాలు వ్రాసి ప్రచారం చేశాడు. అది చదివిన వారంతా నిజమే కాబోలనుకొన్నారు. ఆ హాల్ నిర్వాహకుడు ఆదిత్య అనే చురుకైన యువకుడు. బాగా చదువుకొన్న వాడు. సంస్కారం తెలిసినవాడు. ప్రేక్షకులకు ఏది అసలైన నిజమో చెప్పుకోలేని స్థితిలో ఆ పిల్లవాడు ఎంతగా మదన పడ్డాడో చెప్పలేము.

అభిమాన సంఘాలు తమ హీరోల పరువు తీసే పోకడలు మానుకొంటే తప్ప సినిమా హాళ్ల యాజమాన్యాలకు మనశ్శాంతి వుండదు.

## కాంగ్రెస్ నిర్వీర్యం

11వ పేజీ కొరవ

విధించారు. తమకు గిట్టనివారు కాంగ్రెస్‌వాదులైనా సరే, ఎన్నికలలో పాల్గొనకూడదని మోకాలు అడ్డం పెట్టారు. కానీ తాము మాత్రం కనీసపాటి ఎన్నికల నిర్వహణ కూడా చేయకుండా, సుబ్బరామిరెడ్డిగారిని కొల్లగొట్టి కోట్లకు కోట్లు మూటలు కట్టుకోవడానికి శక్తి యుక్తులన్నీ వెచ్చించారు. ఆయన్ను ఎక్కడా ఎన్నికల ప్రచారం చేసుకోనివ్వలేదు. ఇందిరాభవన్ లోనో, ఏదో ఒక కళ్యాణమండపంలోనో తోలుకొచ్చిన జనంతో ఏదో ఒక పేరుతో సభ పెట్టి, అదే ప్రచారం పొమ్మన్నారు. కనీసం నెల్లూరు నగరంలో కూడా అభ్యర్ధి జనంతో మమేకమయ్యే అవకాశం ఇవ్వలేదు. పోలింగ్ రోజు కూడా అదే పరిస్థితి. నెల్లూరు నగరంలో చాలా పోలింగ్ కేంద్రాలలో కాంగ్రెస్‌కు ఏజంట్లు లేని దుర్గతి మనకు తెలిసిన చరిత్రలో ఎప్పుడూ ఎరుగము.

### మహీధర్ కూడా అంతే

ఆనం సోదరుల తాత వలె వ్యవహరించాడు మరొక మంత్రి మహీధర్‌రెడ్డి. కందుకూరు నియోజకవర్గం మీద పెత్తనం ఆయనది. సుబ్బరామిరెడ్డి గారు ఎన్నికల ప్రచారం కోసం మే నెల 4తేది నెల్లూరు వచ్చారు. కానీ జూన్ 8తేది వరకు ఆయన కందుకూరులో అడుగు పెట్టకుండా ఆంక్షలు పెట్టాడు మహీధర్‌రెడ్డి. ఆ ఒక్క రోజు తూతూ మంత్రంగా ఒక చిన్న రోడ్ షో పెట్టి అదే ప్రచారం పొమ్మన్నాడు. తన స్వంత గ్రామానికి కూడా తీసుకొని వెళ్లలేదు. ఆయనకు, జగన్ అభ్యర్ధి మేకపాటి రాజమోహన్‌రెడ్డికి లోపాయికారీ సంబంధం వుందని, కందుకూరులో వైఎస్.విజయమ్మ ప్రచారం రోజే అర్ధమైపోయింది. మహీధర్ స్వగ్రామం మాచవరంలో ఆమె వ్యాన్ ఎక్కి మాట్లాడకుండా అడ్డుపడ్డాడు రాజమోహన్‌రెడ్డి. ఆ రోజే విషయం అందరికీ అర్ధమైపోయింది. కానీ సుబ్బరామిరెడ్డి గారు ముందు జాగ్రత్తపడలేక పోయారు. తన దగ్గర ఎవరు ఎంత ఎక్కువ డబ్బు తీసుకొంటే వారు తనకు అంత గొప్పగా మేలు చేస్తారని భావించారాయన.

### ఇకనైనా జాగ్రత్త పడతారా?

కారణం ఏదైనా, కారకులు ఎవరైనా కాంగ్రెస్ అవమానకరమైన ఓటమిని ఎదుర్కొన్నది. ఎన్టీఆర్ ప్రభంజనం వీచిన రోజులలో కూడా కాంగ్రెస్ అభ్యర్ధులు ఇంత దారుణమైన ఓటమి పరాభవం చవి చూడలేదు. ఇది కేవలం స్వయంకృతాపరాధమే. ఒకరిద్దరు నాయకుల స్వార్ధం కోసం మొత్తం పార్టీయే బలైపోయింది. అసలే అంతంత మాత్రంగా వున్న కాంగ్రెస్ కార్యకర్తల మనోధైర్యం ఈ ఓటమితో మరింత నీరుగారి పోయిందనడం నిజం. ఒక్క కాంగ్రెస్‌వాది ముఖంలో నెత్తురు చుక్క లేదు. హతాశులై పోయి వున్నారు అందరూ. వారిలో మళ్లీ ఉత్సాహం నింపి, 2014 ఎన్నికల నాటికి పార్టీని పునరుజ్జీవం చేసే ప్రయత్నం ఇప్పటినుంచే మొదలుపెడితే తప్ప కాంగ్రెస్‌కు భవిష్యత్తు వుండదు.

### తెలుగుదేశం నాశనం

ఈ ఎన్నికలలో మరొక ముఖ్య పరిణామం తెలుగుదేశం పార్టీ పూర్తిగా నిర్వీర్యమై పోవడం. మొన్నటి కోవూరు ఉపఎన్నికలో ఆ నియోజకవర్గంలో 53 వేల ఓట్లు వచ్చాయి ఆ పార్టీకి. కానీ ఇప్పటి ఎన్నికలలో అదే కోవూరులో కేవలం 17 వేలకు పరిమితమై పోయింది. తెలుగుదేశం ఓటు బ్యాంకు మొత్తం జగన్ పార్టీకి వలస పోయిన నిజాన్ని నిర్ధారణ చేసింది ఈ ఎన్నిక. ఆత్మకూరు, నెల్లూరు రూరల్, నెల్లూరు నగర నియోజకవర్గాలలో ఆ పార్టీ స్వతంత్ర అభ్యర్ధుల స్థాయికి పతనమై పోయింది. తెలుగుదేశం పెద్దలు చేజేతులా చేసుకొన్న పాపం ఇది. 1999, 2004 ఎన్నికలలో నెల్లూరు నియోజకవర్గాన్ని బిజెపికి కేటాయించినప్పటి నుంచి నగరంలో పార్టీని నిర్లక్ష్యం చేశారు. రమేష్‌రెడ్డికి పార్టీని నడిపించే శక్తి లేదు. ఆయన్ను తప్పించి వేరొకరికి ఆ బాధ్యత అప్పచెప్పే ధైర్యం జిల్లా నేతలకు లేదు. దానితో పార్టీ నాశనమైపోయింది. ఆత్మకూరులో కొమ్మి లక్ష్మయ్య నాయుడును కోల్పోవడం పెద్ద అపరాధం. ఆయన లేని లోటును పూడ్చగల నేతను మరొకరిని వెతికి పట్టే శ్రద్ధ ఎవరూ చూపలేదు.

దానితో జిల్లాలో తెలుగుదేశం ఓటు బ్యాంక్ మొత్తం కరిగి నీరైపోయింది. జగన్ ప్రవాహంలో కలిసిపోయింది. సమీప భవిష్యత్తులో ఆ పార్టీ మళ్లీ కోలుకోగలదని ఆశించలేము.

## పెరిగిన పలుకుబడి!

మొదటి పేజీ కొరవ

గెలిపించింది. మరొకప్రక్క ఇక్కడ బిజెపి అభ్యర్ధిని నిలబెట్టడం జగన్‌తో లాలూచీ వ్యవహారమన్న అనుమానం ఒకటి వుంది. ఆ పార్టీ వల్ల టిఆర్ఎస్‌కు 7వేల వరకు ఓట్లు తగ్గాయి. ఈ అన్ని కారణాలు విశ్లేషించి చూస్తే 2014 ఎన్నికలలో తెలంగాణలో నెగ్గుకొని రావడం జగన్‌కు అంత సులభమేమీ కాదు.

అయితే పరకాల ఉత్సాహంతో తెలుగుదేశం, కాంగ్రెస్‌ల నుంచి పెద్ద సంఖ్యలో ఎమ్మెల్యేలు వలస వస్తారన్న ప్రచారం నడుస్తున్నది. అదే నిజమైతే మాత్రం తెలంగాణలో కూడా జగన్ పార్టీకి వ్యవస్థ నిర్మాణం జరుగుతుంది. అప్పుడే ఏ ఎన్నికను ఎదుర్కోవడానికైనా సిద్ధంగా వుండవచ్చు.

ఈ ఉపఎన్నికలు కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలకు మాత్రం చేదు జ్ఞాపకాలను మిగిల్చాయి. కాంగ్రెస్ ఏడు స్థానాలలో, తెలుగుదేశం ఐదు స్థానాలలో డిపాజిట్ కోల్పోయాయి. దాని అర్ధం ఆ రెండు పార్టీలూ ప్రజల విశ్వాసం కోల్పోతున్నాయని. అంటే వచ్చే ఎన్నికలలో ఈ రెండు పార్టీలు అధికారానికి చేరువ కాలేవు. ఇప్పటికే పదేళ్ల పదవీ వియోగంతో తెలుగుదేశం పార్టీ నామమాత్రావశిష్టమై పోతున్నది. వచ్చే ఎన్నికలలో కూడా ఓటమి తప్పదనే భీతి కల్గితే, ఆ పార్టీలో నాయకులు మిగలరు. కార్యకర్తలు అసలే మిగలరు. చంద్రబాబును పెద్ద చిక్కులలోకి నెట్టాయి ఈ ఉపఎన్నికలు.

ఇన్ని స్థానాలలో ఓటమిని ఎదుర్కొన్న ముఖ్యమంత్రి, తన పదవిలో కొనసాగగలరా, ప్రభుత్వాన్ని నిలబెట్టగలరా అన్న చర్చ జనంలో జోరుగా నడుస్తున్నది. ఎమ్మెల్యేలు వలస వచ్చేస్తారని, ప్రభుత్వాన్ని కూలగొడతారని అంచనా వేస్తున్నారు సాధారణ జనం. అయితే ఆంధ్ర నుంచి ఎమ్మెల్యేలు జగన్ పార్టీకి వలస వెళ్లే పరిస్థితి కన్పించడం లేదు. ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాలు రెండింటిలో ప్రతి నియోజకవర్గంలో ఒక అభ్యర్ధిని ముందుగానే నిర్ణయించి పెట్టాడు జగన్. ఆ ప్రకారం హామీలు ఇచ్చివున్నాడు. కొత్తగా వచ్చే వారికి స్థానం దొరికే అవకాశం లేదు. పై ఎన్నికలలో టిక్కెట్ హామీ లేకుండా ఎమ్మెల్యేలు ఎందుకు వలస వెళ్తారు? అట్లా వెళ్లినందువల్ల వారికి లాభమేమిటి? తెలంగాణ నుంచి వలస వుంటుందా అన్నది వేచి చూడాలి. పరకాల ఒక్కదానిలో చెప్పుకోదగిన స్థాయిలో ఓట్లు తెచ్చుకొన్నంత మాత్రాన, తెలంగాణ మొత్తంలో అదే పరిస్థితి వుంటుందని ఎమ్మెల్యేలు నమ్ముతారా? అనుమానమే. కెసిఆర్‌ను చూస్తే తెలంగాణ రాజకీయవాదులకు చెడ్డ భయం. ఆయన ఎప్పుడే మంత్రం వేసి, మాయ చేస్తాడో అన్న ఆందోళన అందరిలోనూ వుంటుంది. అందువల్ల పరకాలను చూసి తొందరపడి నిర్ణయం తీసుకోవడానికి ఎమ్మెల్యేలు సాహసించక పోవచ్చు. అయితే కాంగ్రెస్‌వాదులు మాత్రం తెలంగాణ ఇమ్మని కేంద్రంపై ఒత్తిడి పెంచారు. అది వీలు కాకుంటే తెలంగాణ కాంగ్రెస్ పేరిట కొత్త పార్టీ పెట్టుకొంటారు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### వైభవంగా వెంగమాంబ తిరునాళ్లు!

మెట్ట ప్రాంతీయుల ఆరాధ్య దేవత వెంగమాంబ బ్రహ్మోత్సవాలు నర్రవాడలో 10వ తేది నుంచి 14వ తేది వరకు ఘనంగా జరిగాయి. 11, 12 తేదీల్లో గ్రామోత్సవం, సంతానంలేని వారు వర పడడం వంటి కార్యక్రమాలు జరిగాయి. 13వ తేది వేదపండితుల మంత్రోచ్చారణలు, వేలాది భక్తుల నడుమ వెంగమాంబ పేరంటాలు, గురవయ్య నాయుడుల కళ్యాణం కన్నుల పండుగగా జరిగింది. అగ్ని గుండం తొక్కడంతోపాటు ఎద్దులు, బండలాగుడు పందాలను వేలాదిమంది భక్తులు తిలకించారు. విద్యుత్ దీపాలంకరణతో నర్రవాడ ధగధగ లాడిపోయింది. లక్షలాది మంది భక్తులు తరలి వచ్చిన ఈ ఉత్సవాలకు ఎటువంటి అసౌకర్యం కలగకుండా దేవాదాయ శాఖాధికారులు, ఇఓ వేగూరు రవీంద్ర రెడ్డి శ్రమించారు.

## పదరంగం -20

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | 4 | 5 | 6 | | 7 |
| | | | | 8 | | | | | | |
| | | | | | | | | | 9 | |
| | | 10 | 11 | | 12 | | 13 | | | |
| | 14 | | | | | 15 | | | 16 | |
| 17 | | | | | 18 | | | | 19 | |
| | 20 | | | | 21 | | | | | |
| | | | | 22 | | | | 23 | | |
| 24 | | | | | | 25 | 26 | | | |
| | | | | 27 | | | | | | 28 |
| 29 | | | | | 30 | | | | 31 | |

**అడ్డం**

1. పురాతన కాలం (5)
4. కోర్టు ఉద్యోగి (3)
8. ముఖం చిన్నబుచ్చుకున్న చిన్నది (5)
9. పత్రం (2)
10. పోగు, కుప్ప (2)
12. తోడుగా ఉన్న స్త్రీ (4)
15. శ్రీహరి (4)
17. సైన్యం (2)
19. వాదించేవాడు (2)
20. జర్నీ (3)
21. జానువు, కాలు పైభాగం (3)
22. బ్యూటీ (2)
24. మెజీషియన్ (4)
25. కారణం లేక పోవడం (4)
27. టైము కాప్పులు (5)
29. హారతి (4)
30. సైకతం (3)
31. రాయి (2)

**నిలువు**

1. నివృత్తి, నిష్కృతి (4)
2. అమెరికా జలపాతం (4)
3. లంకలోని రాక్షసి (3)
4. అర్థం చేసుకోవడం (5)
5. పైన (2)
6. నాయిన, తెలికయ్యాడు (2)
7. నడిపించేవాడు (4)
11. పురాణ కాలం రక్షక కవచం (4)
13. పాదాలు (4)
14. సొరకాయ (5)
16. పారితోషికం అవార్డు లాంటిదే (3)
18. ఒప్పుదల (3)
23. దాగు, మచ్చు ((3)
24. అభిమాన వంతురాలైన స్త్రీ (3)
25. పైనాపిల్ (3)
26. కలకత్తా దేవి (3)
28. శిరస్సు (2)
30. క్రింద నుంచి ఈ లోకం (2)

సమాధానాలు

## పదరంగం -19

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఆ | బా | ల | 2 గో | పా | 3 లం | | 4 ర | హ | 5 దా | రి |
| మ | | | రూ | | చం | | | | సో | |
| 6 ని | 7 జ | 8 రూ | పం | | | 9 అ | హ | ర | హం | |
| | 10 లం | క | | 11 తు | ఫా | ను | | | | 12 స్త్రై |
| 13 రా | ధ | | 14 వే | | | 15 చి | తా | 16 భ | స్మం | |
| | రు | | | 17 వే | | తం | | య | | |
| 18 కు | డు | 19 ము | | గు | | | | భ | | |
| | | రా | | ల | | 20 ఛ | లో | క్తు | లు | |
| 21 అ | రి | | 22 ఆ | వా | సం | | | ల | | 23 జా |
| డ | | 24 చె | | రు | | 25 త్రో | | 26 తో | 27 య | ము |
| 28 వి | త | ర | ణ | | 29 రే | వ | డి | | తి | |

# సంక్షిప్త సింహపురి

## దళిత విద్యార్థి సేన కన్వీనర్‌గా జోగి శ్రీకాంత్!



ఆంధ్రప్రదేశ్ దళిత విద్యార్థి సేన గూడూరు కన్వీనర్‌గా మాజీ ఎమ్మెల్యే జోగి మస్తానయ్య కుమారుడు జోగి శ్రీకాంత్‌ను జిల్లా అధ్యక్షుడు అరవ పూర్ణప్రకాష్ నియమించారు. ఈ సందర్భంగా 7తేదీ నెల్లూరు ప్రెస్‌క్లబ్‌లో పూర్ణప్రకాష్ విలేకరులతో మాట్లాడుతూ జోగి మస్తానయ్యలాగే శ్రీకాంత్ కూడా దళిత నాయకునిలా ఎదగాలని ఈ పదవిలో నియమించినట్లు చెప్పారు. గూడూరు డివిజన్‌లోని అన్ని మండలాల్లో దళితుల చైతన్యానికి కృషి చేస్తానని శ్రీకాంత్ ఈ సందర్భంగా చెప్పారు. మస్తానయ్య ఎమ్మెల్యేగా పనిచేసినా బాడుగింట్లో చనిపోయిన మంచి మనిషి. శ్రీకాంత్ దళిత ఉద్యమంలో ఎదగను ఈ పదవితో శ్రీకారం జరగాలి.

## శుక్ర గ్రహ అంతర్యానం వీక్షణ!



నెల్లూరు కనక మహల్ సెంటర్‌లో జన విజ్ఞాన వేదిక ఏర్పాటు చేసిన టెలిస్కోప్ ద్వారా వందలాది మంది నెల్లూరీయులు శుక్ర గ్రహ అంతర్యానాన్ని వీక్షించారు. ఈ సందర్భంగా జెవివి నిర్వాహకులు ప్రజలకు సోలార్ ఫిల్టర్లను కూడా అందజేశారు. టెలిస్కోప్ ద్వారా పరోక్ష పద్ధతిలో తెరపై ఏర్పాటుచేసిన శుక్ర గ్రహ అంతర్యానాన్ని ప్రజలు ఆసక్తిగా వీక్షించారు. ఈ సందర్భంగా జెవివి నాయకులు ఆనంద్ రామ్ సింగ్ మాట్లాడుతూ శుక్ర గ్రహ అంతర్యానం కూడా సూర్యగ్రహణం వంటిదేనని, విశ్వంలో సహజంగా జరిగే రహస్యాలను తెలుసుకోవాలన్నారు. ఈ కార్యక్రమంలో జెవివి నాయకులు గౌస్‌బాషా, డాక్టర్ శ్రీను నాయక్, కృష్ణారావు, ఉమామహేశ్వరరావు, సూర్యప్రకాష్, డాక్టర్ రాజేశ్వరరావు, డాక్టర్ ఎమ్వీ రమణయ్య, డాక్టర్ దత్తాత్రేయులు పాల్గొన్నారు.

## రాజకీయ సునామీ రానుంది!

ఉపఎన్నికల్లో నెల్లూరు పార్లమెంట్ స్థానం నుంచి తాను గెలుస్తానని ఆ తర్వాత రాజకీయ సునామీ వస్తుందని మేకపాటి రాజమోహన్‌రెడ్డి ఆత్మవిశ్వాసం వ్యక్తం చేశారు. తన ప్రచార పర్వం గూర్చి నెల్లూరులో విలేకరులతో మాట్లాడుతూ జగన్ అరెస్ట్‌కు ముందు కాంగ్రెస్, తెలుగుదేశం తనకు కొంత పోటీ అయినా ఇచ్చేవని, జగన్ అరెస్ట్‌తో పరిస్థితి పూర్తిగా మారిపోయిందన్నారు. తనతోపాటు రాష్ట్రంలో పోటీలో వున్న వైకాపా అభ్యర్థులంతా గెలుస్తారని దీంతో రాజకీయ సునామీ ఖాయమని తేల్చి చెప్పారాయన.

## పాద రక్షలు పంపిణీ



జిల్లా చిరంజీవి యువత ఆధ్వర్యంలో పేద వారికి నెల్లూరులో పాద రక్షలు పంపిణీ చేశారు. చిరంజీవి యువత గౌరవాధ్యక్షుడు ఎ.రాజ్‌కుమార్ పర్యవేక్షణలో చిరంజీవి యువత కార్యాలయం నుండి ఆత్మకూరు బస్టాండ్, కనకమహల్ సెంటర్, గాంధీబొమ్మ సెంటర్, విఆర్‌సి సెంటర్ మీదుగా ఆర్టీసి బస్టాండ్ వరకు పాదరక్షలు పంపిణీ చేశారు. గతంలో తమ సంస్థ ఆధ్వర్యంలో రక్తదానం, నేత్రదానం తోపాటు పేద ప్రజలకు ఉపయోగపడే పలు సేవా కార్యక్రమాలు నిర్వహించామని రాజ్‌కుమార్ చెప్పారు. ఈ కార్యక్రమంలో జిల్లా చిరంజీవి యువత అధ్యక్షుడు పి.చంద్రశేఖర్, కార్యదర్శి వై.రవికుమార్, కో కన్వీనర్ కొట్టే వెంకటేశ్వర్లు, నగర చిరంజీవి యువత నాయకుడు కె.కృష్ణారెడ్డి పాల్గొన్నారు.

## బిఎస్ఎన్ఎల్ ఉద్యోగుల అల్టిమేటం



తమ న్యాయమైన డిమాండ్లను పరిష్కరించకుంటే ఈ నెల 13తేదీ నుండి విధులు బహిష్కరిస్తామంటూ బిఎస్ఎన్ఎల్ ఉద్యోగుల సంఘం జెఎసి నాయకులు హెచ్చరించారు. బిఎస్ఎన్ఎల్ కార్యాలయం వద్ద ధర్నా నిర్వహించిన నాయకులు మాట్లాడుతూ రద్దు చేసిన అలవెన్సులు తిరిగి మంజూరు చేయాలని కోరారు. అదేవిధంగా 78.2 శాతం డిఏను జీతంతో కలిపి ఇవ్వాలని డిమాండ్ చేశారు. తమ డిమాండ్లను పరిష్కరించకపోతే ఆందోళన ఉధృతం చేస్తామన్నారు. ధర్నాలో నాయకులు అంకయ్య, శివశంకర్‌రెడ్డి, మస్తానయ్య, అస్లాం, రాజేంద్రన్ పాల్గొన్నారు.



రైతు లోకం

# కలుపు నివారణ జాగ్రత్తలు

ప్రస్తుత సీజన్‌లో అరటి తోటలకు తెగుళ్ల సోకే ప్రమాదం వుంది. ముందు జాగ్రత్తలు పాటించి అవసరమైన చర్యలు తీసుకుంటే తెగుళ్ల నివారించవచ్చని వ్యవసాయశాఖ అధికారులు చెబుతున్నారు. సిగటోకా అనే ఆకు మచ్చ తెగులు వ్యాపిస్తుంది. వర్షాకాలం ప్రారంభం కాకముందే లీటరు నీటికి 2.5గ్రాముల క్లోరోథలోనిల్ కలిపి ఆకులన్నీ తడిచేలా పిచికారి చేస్తే ప్రయోజనం వుంటుంది. వర్షాలు కురిసేటప్పుడు తెగులు లక్షణాలు కనిపిస్తే వెంటనే లీటరు నీటికి ఒక గ్రాము ట్రయిడిమార్ఫ కలిపి పిచికారి చేయాలి. తెల్ల చక్కెర కేళి, పెద్ద పచ్చ అరటి, పొట్టి పచ్చ అరటి రకాలకు సిగటోకా ఆకుమచ్చ తెగులు బెడద వుంటుంది. ఆకులపై చిన్న పసుపు రంగు మచ్చలు కనిపించగానే తెగులు వ్యాపించినట్లు గుర్తించాలి.

ఈ మచ్చలు క్రమంగా గోధుమ రంగులోకి మారి పెద్దవై ఒకదానితో ఒకటి కలిసిపోతాయి. ఈ తెగులు తీవ్రమయ్యే కొద్దీ ఆకులు ఎండిపోతాయి. అరటి గెల వదిలిన తర్వాత తెగులు ఉధృతమైతే కాయలు పెరగక నష్టం అధికంగా వుంటుంది. దుంప పచ్చ తెగులు వ్యాపించకుండా మొక్కల మొదళ్ల దగ్గర నేలను కుళ్లగించి 25గ్రాముల కార్బోఫ్యూరాన్ గుళికలు వేసి మట్టితో కప్పి నీరు పెట్టాలి. గుళికలు వేయడం ద్వారా అరటిని ఆశించే ఇతర పురుగులు కూడా అదుపులో వుంటాయి. అరటి చెట్లు పొటాష్ లోపానికి గురికాకుండా జాగ్రత్త పడాలి. ఈలోపం వల్ల కూడా ఆకులు పసుపు రంగులోకి మారి ఎండిపోతాయి. 135 రోజుల వయసు దాటిన చెట్ల ఆకులు పొటాష్ లోపానికి గురయ్యే ప్రమాదం వుంది. దీనిని నివారించడానికి లీటరు నీటికి 5గ్రాములు సల్ఫేట్ ఆఫ్ పొటాష్‌ను కలిపి ఆకులన్నీ పూర్తిగా తడిచేలా 10రోజుల వ్యవధిలో రెండుసార్లు పిచికారి చేయాలి. అరటి మొక్కకు ఇరువైపులా చిన్న గుంతలు చేసి 80గ్రాముల మ్యూరేట్ ఆఫ్ పొటాష్‌ను వేసి మట్టికప్పి నీరు పెట్టాలి.

వైరస్ తెగుళ్ల అరటికి చాలా ప్రమాదకరమైనవి. ఈ తెగుళ్ల వ్యాప్తి చెందకుండా ముందుగానే జాగ్రత్తలు పాటించాలి. పిలకల ద్వారా వైరస్ తెగుళ్ల కొత్త తోటలకు వ్యాపిస్తాయి. వైరస్ తెగుళ్ల సోకిన మొక్కలను దుంపలతో సహా తీసి తోట బయటకు చేర్చి తగులబెట్టాలి. తర్వాత లీటరు నీటికి 2మి.లీ మిథైల్ డెమటాన్ కలిపి ఆరోగ్యవంతంగా వున్న అన్ని పిలకల చెట్ల ఆకులు పూర్తిగా తడిచేలా పిచికారి చేయాలి.



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com